# అనుక్రమణి

స్వర్గీయ

శ్రీ సురవరం ప్రతాపరెడ్డికి



# ప్రస్తావన

## డా. బూర్గుల రామకృష్ణరావుగారు

(హైదరాబాదు ముఖ్యమంత్రి)

శ్రీ దాశరథి బాల్యమునుండియే ప్రతిభావంతమైన కవితను వ్రాయుచు ఆంధ్రలోకమునకు సుపరిచితులయినారు. ఆయన కవిత చాల కాలమునుండి నా హృదయము నాకర్షించుచు వచ్చినది. 'మహాంధ్రోదయము' న నీ యువకవి వ్రాసిన ప్రతి కావ్య ఖండము చదువగ చదువగ నమృత గుళికవలె హృదయానందకరముగ నుండును. మహాకవి కాదగుట కనువైన కవితాబీజము లీకవిలో వర్ధిల్లుచున్నవనుట కీకావ్యము ఒరగల్లుగా నున్నది. తెలంగాణమునుగూర్చి యీ కవి యాలపించిన గేయములు, పద్యములు కర్ణపేయములుగా నున్నవి. రాష్ట్ర స్వాతంత్ర్యోద్యమములో దేశమునకు దూరమున నుండక మాతృభూమి పారతంత్ర్య విముక్తికై తన కవితద్వారా అమోఘమైన కృషిసలిపి కారాగారవాస క్లేశములనుగూడ ననుభవించిన దేశభక్తుడు దాశరథి. ఆంధ్ర సాహిత్యలోకమునకు మకుటాయమానులయిన కీ. శే. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి కీకావ్యము నంకిత మొనర్చుట ఈ కవిశేఖరుని యుచితజ్ఞతను చాటుచున్నది. ఇందలి కావ్య ఖండములలో తెలంగాణా, శిల్పి, తెలంగాణావిముక్తి, తెలంగాణా తల్లి, పౌషలక్ష్మి, కపోతీసందేశము, మంజీర యనునవి విసర్గ భావవాహులై కావ్యమంతయు మహాస్రవంతి వలె నత్యంతాహ్లాదకరంబై యల

రాచు చున్నది. రచన, శైలి మున్నగునవి యీ కవి సాహిత్యవ్యుత్పత్తిని, రస భావాలంకారాదులు ప్రతిభా విశేషమును చాటుచున్నవి. బాల్యము నుండియు కవితాభ్యాస మొనర్చుచున్న ఈ కవితా తపస్వి కావ్యము సహృదయ హృదయానందకరముగ నున్నదనుటలో నతిశయోక్తి లవమైనను లేదు. ఈయన యితోధికముగ రచనలొనర్చి ఆంధ్రకవి శిరోమణియై తెలుగు వీలమును మహాకావ్యోద్యానములచే వెలయించుచు చిరతర కీర్తిని గడించుగాక!

హైదరాబాదు
30—8—1955.

# ఆశంసన

## శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు

(ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి)

శ్రీ దాశరథి విప్పారిన తెలంగాణ కోటి గొంతుల ధ్వని. 'మూడు కోటుల నొక్క-టే ముడి బిగించి' దాశరథి 'మహాంధ్ర సౌభాగ్య గీతి'ని ముక్తకంఠముతో ఆలపించు చున్నాడు. ఈయన కవితాకన్య ఒకప్పుడు 'అగ్నిచేలము' లను ధరించి నృత్యము చేయును. మరియొకప్పుడు పీడిత ప్రజావాణికి 'మైక్'గా ఏర్పడును. ఇంకొకప్పుడు ప్రకృతి సౌందర్యమును ప్రతిబింబింప జేయును. శ్రీ దాశరథి ప్రతిభా వ్యుత్పత్తులు సరిసమానముగా గల సంస్కా-రి. మహాంధ్రో దయము కనుచూపు మేరలో ఉన్నట్లుగ కనుపడుచున్న ఈ నాడు ఈ కావ్యము ఆ దివ్య సందేశమును మూలమూలకు అందజేయగలదని ఆశించుచున్నాను.

*కర్నూలు*
*27—8—1955*

# పీఠిక

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

మహాంధ్రోదయమనే ఈ గ్రంథము ఇరువది ఖండకావ్యముల సంపుటి. ఏతత్కృతికర్త ఆయుష్మంతుడూ వర్ధిష్ణువూ అయిన దాశరథిః పిన్న వయసుననే పెద్ద పేరు గాంచిన తెలంగాణా మహాకవి.

మహాంధ్రోదయము ప్రధానముగా దేశాభిమానోద్దీపక ఖండకావ్య సంచయము. ఈ ఖండ కృతులన్నియు ఈ వరకే ప్రకటితములయినవి. ఇవి ఈవరకే తెలంగాణాలోనే కాదు, తెలుగు దేశమంతటా ప్రసిద్ధములయి ప్రచారములో ఉన్నవి. దాశరథిని తెలుగువారికి తొలుదొలుత పరిచయము కావించి అతనికి పేరు తెచ్చిన వివే. వీటి నన్నిటిని కలిపి మహాంధ్రోదయ మనుపేర గ్రంథరూపమున ప్రచురించుటకు ఇదే మొదటి తడవ.

దేశాభిమాన ఉద్దీపకములు, ఉద్బోధకములు అయిన ఖండకావ్యములు తెలుగులో వెలసి తెలుగు సాహిత్యమును నవ్యాలంకార పరిశోభితము కావించినదీ శతాబ్దములోనే. పరదాస్యమున చిక్కువడియున్న జాతిని అది పూర్వము సాధించిన మహత్కార్యములను, దాని పూర్వవైభవౌన్నత్య ప్రతిష్ఠలను జ్ఞప్తికెలయించి పూర్వపు గొప్పదనపు చారిత్రక స్మృతులు రేపి ప్రబోధించుటకు వచ్చినవి ఈ దేశాభిమానోద్దీపక

కృతులు; నిద్రలేపి మాంద్యమును, అలసత్వమును బోగొట్టి జాతిని నూతన చైతన్యదీపితమును, కార్యపరతంత్రమును గావించుటకు అవతరించిన వివి. నిర్వీర్యమై, నిద్రాలసమై యున్న జాతిలో శౌర్యమును, చురుకుదనమును రేకెత్తించి యిదివరలో అందుకొన్న పూర్వపు టౌన్నత్య శిఖరమును దృష్టికి తెచ్చి అది ఇతోధికాభ్యున్నతికై ప్రయత్నింప జేయుటకు దేశాభిమాన భావోత్తేజకములుగా ఉండేటట్లు విరచించిన కావ్యకుసుమము లివి - ఆనంద, దర్పానుభూతి సముత్పాదకములు.

నేడు కావ్యమన్న బహుళముగా ఖండకావ్యమే. దేశాభిమాన ఉద్దీపకములు, ఉద్బోధకములు అయిన ఖండకృతుల రచనలో తొలుదొలుత శ్రీకారము చుట్టిన సుప్రసిద్ధాంధ్ర మహాకవి ప్రముఖులు ఎన్నికగన్న కవి సమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారును, నవ్యసాహిత్యాచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారును. వందేమాతరోద్యమము వెల్లివిరిసిన ఈ యిరువదవ శతాబ్దిపు ప్రథమదశకాంతమునుండి దేశచరిత్రములోని ఆఖ్యానములను, విజయాంకిత గాథలను, ఉద్దీపకములయిన చరిత్ర విషయములను వస్తువులుగా తీసికొని నవ్యాంధ్రకవికుమారులు కావ్యములు రచించి తెలుగు జాతిలో ఒక నూతనోత్సాహమును మొలకలెత్తించి దానిని నూతనాశయభావ ప్రఫుల్లము కావించిరి. ఇటువంటి నవమంజుల మనోహర కావ్యగీతి కాలాపములతో అంతవరకు జడప్రాయమై నిర్వీర్యమై యున్న ఆంధ్రజాతి ఆత్మశక్తి స్వరూప సందర్శనము చేసికొన్నట్లయినది. ఆంధ్రోద్యమము మొదలు ఆంధ్రరాష్ట్రావతరణమువరకు ఆంధ్ర జాతికి నూతనశక్తిని, నూతనోత్సాహమును కలిగించి వారిని జాతీయో

ద్యమకాలోన్వ వ్యగ్రులుగను, ఘాటులుగను తీర్చి దిద్దినవి ఈ దేశాభిమానో ద్దీపక కృతులే.

ఇటువంటి దేశాభిమాన ఉద్దీపక, ఉద్బోధక కృతులు తెలంగానాలో వందే మాతరోద్యమ కాలమునుండి వచ్చుటకు కాని, అట్టి యుద్యమము వల్లనె అచట కొనలుసాగి మారాకు తొడుగుటకు కాని పోలీసుచర్య జరిగే వరకు అవకాశమే లేకపోయినది. నిరంకుశమైన నిజాం నవాబు పరి పాలనలో స్వేచ్ఛగా మనసులోని కోర్కెలను బహిరంగముగ వెల్లడించు టకు కాని, సభలుచేసి తమ యిక్కట్టులను తెలుపుకొనుటకు గాని తెలం గానా ప్రజల కెంత మాత్రము వీలు లేకపోయినది. అయినప్పటికి పూజ్యు లయిన శ్రీ మాడపాటి హనుమంతరాయ ప్రభృతులు కష్టనష్టముల కోర్చి తెలంగానా ప్రజలను రహస్యముగనో, బహిరంగముగనో, చాటుననో మాటుననో ఉద్బోధించి వారిలో చెన్నుమాసిన తెలుగుతనమును ఉద్దీ పింపజేయుటకు, క్రొత్త చైతన్యమును చిలుకరించి వారిలో సంఘీభావ మును ప్రబోధించుటకు ప్రభుత్వపు ఉక్కు చట్టపురేకుల మడతలలో బడి నలుగుచునే బహువిధముల కృషిచేసియున్నారు. రజాకారు దినములు తెలంగానా ప్రజల పాలిట యమదంష్ట్రిక లయినవి. ఆ దినములలోనే యువకవికుమారులు స్వాతంత్ర్య గీతము లాలపించుటకును, దేశాభిమా నోద్దీపక కృతులు పాడుటకును ఆరంభించినను క్రమముగా విప్లవడి వారికి పూర్తిగా కంఠము వచ్చినది అక్కడి పోలీసు చర్య అనంతరమే యన్న అది సత్యదూరము కాదేమో. ఈ విధమైన దేశాభిమానోద్దీపక గీతములు తెలంగానములోని తెలుగువారిలో ఉత్సాహ స్రవంతులను వెల్లి

విరియజేసి వారికి శక్తిని, దేశానురక్తిని గలిగించి నిరంకుశ శక్తుల నెదిరించి నిలుచుటకు తగిన బలమును వీరత్వమును ప్రసాదించినవి.

నేడు తెలంగానాలోని యువకవి కుమారులు, రచయితలు 'ఆంధ్ర రాష్ట్రము'లోని కవి కుమారులతోను రచయితలతోను చేయి చేయి కలిపి, సాహిత్యరంగములన్నిటిలోను వారితో సరిసమానముగనే కాక ఇక కొంచె మెక్కువగనే కృషిచేసి విఖ్యాత కీర్తులగుచున్నారు. 'ఆంధ్ర రాష్ట్రము'లో కంటెను సాహిత్యకృషి తెలంగానాలో ఇనుమిక్కిలిగా సాగుచున్నది. వస్తు రచనా వైవిధ్యముగల ఉత్తమ కావ్యములును వచ్చుచున్నవి. తెలంగానా ఇంత త్వరితకాలములో ఇతరాంధ్రముతో సాహిత్య కృషిలో కలుసుకొనుట కాదు, సాహిత్యక్షేత్రమున సుమనో మనోజ్ఞములును, రసప్రకర్షకములు నైన మేలి పంటలు పండించుచుండుట ప్రమోదావహమును, ప్రశంసనీయమును.

తెలంగానాలో దేశాభిమాన ప్రబోధకగీతములాలపించిన కవి కుమారులలో దాశరథిదే అగ్రస్థానము. ఇతడు తెలంగానా సాహిత్య సీమలో క్రొత్త పుంతలు త్రొక్కి క్రొత్త పొలాలు నిర్మించిన ఉత్తమ సాహిత్య కర్షకుడు; కడు ప్రతిభావంతుడు. ఇతని కవిత్వము లలిత పద చమత్కార సంపన్నమై చదివిన కొద్ది చవు లూరించుచుండును.

కవిత్వము పూర్వజన్మ సుకృతమువల్ల లభించు విద్యకాని నేర్చిన మాత్రాన పట్టువడునది కాదు. కానైతే ఏదోవిధమున పద్యము లల్లగలిగిన వారు తెలుగు దేశములో, అనేకులేమి, ఇంటింటను ఉన్నారు. కాని

వ్రాసిన ఛందోబద్ధమైన ప్రతి పద్యమును కవిత్వమును కాదు, పద్య మల్ల గలిగినంత మాత్రాన వారు కవులును కారు. దాశరథి అట్టివాడు కాడు. ఇతడు జన్మతః కవి. ఇతనికి కవిత్వము పుట్టుకతో వచ్చిన సంస్కారము. కానిచో ఆతని పద్యము లింత జనరంజకములై పిన్నపెద్దల మెప్పును చూరగొనుట, ఇంతటి పిన్నవయసుననే అతడంత పెద్ద పేరొందుట కష్టము. పువ్వు పుట్టగనే దాని నెత్తావి నలుగడల క్రమ్ముకొనును కదా!

కవిత్వము భావ ప్రధానమయినది, శబ్దార్థాలంకార భూయిష్ఠమైనది అని రెండు తెరగులు. భావోన్నతి లేని శబ్దార్థాలంకారములు నిరర్థకములు: అవి వట్టి అలంకార ప్రాయములే. అయితే భావాభివ్యంజకమైనది ఏ కొద్ది మంది రసజ్ఞులకు మాత్రమో రుచించును. ఎక్కువ మంది అలంకార పరిశోభితమయిన దానినే మెచ్చి తలయూచెదరు. ఈ రెండు విధము లయిన కవిత్వము చెప్పుటలోను దాశరథికి ప్రజ్ఞ కలదన్న విషయము అతడింతవరకు రచించిన కావ్యములవలననే విస్పష్టమగును.

దాశరథి యొద్ద పూర్వాంధ్ర ప్రబంధకవుల పోకడలును ఉన్నవి; అధునాతన కవుల రాకడలు నున్నవి. చూడు డీ పద్యము:

"పోషము వనితా సుమనో
మోషము, శృంగార రస విముగ్ధ జగత్సం
తోషము, నగ్నాయిత తరు
శేషము, శిశిరానిలోపచిత వేషంబుణా."

ఇది మహాకవి పోతన్నగారి పద్యమును పుణికి పుచ్చుకొన్నట్లు ఎంత లలితముగాను, సొంపుగాను ఉన్నదియు పాఠకులకే తెలియగలదు. "మాధురి" అనే ఖండకావ్యములోని ఈ క్రింది పద్యమును చూడుడు. ఈ నవ్యాంధ్రకవి నవాబ్దమును నాతితో పోల్చి పూర్వ ప్రబంధకవుల వలెనే ఎంత చక్కగా దోహద క్రియలను తెల్పినాడో :

గుమగుమలాడి నా మనసు గొన్న నవాబ్ద సఖీ ముఖానురా
గమున సుమించె చంపకము; కౌగిలిలో ప్రసవించె గోరంటల్;
సుమ రమణీయమై తగె నశోకము తచ్చరణాహతిన్; ప్రహా
సమున సుమించె పొన్నలు పసందగు నందన దివ్యవాటిలో."

నూతన సంవత్సరమనే స్నేహితురాలు రాగానే ఆమె ముఖరాగమున కౌగిలిని, చరణాహతిని, ప్రహాసమున నందన దివ్యవాటిలోని చంపక, కురంటక, అశోక, పున్నాగ భూజములు పూచినవట. స్త్రీ పాద తాడనాది క్రియలవలన తరువులకాలమునకైనను పుష్పించు ననుట కవి సమయము. వసంతాగమనమున క్రొత్తసంవత్సరము వచ్చునప్పటికి నందన దివ్యవాటిలోని భూరుహములు పూవులు పూయుట సహజమే యైనను శిశిరమున పుష్ప విహీనములైన మహీరుహములు నవాబ్దసఖి అనురాగమహిత క్రియలవలన సుమనోమనోజ్ఞములయినవని కవి చమత్కరించినాడు.

ఇక కొంగ్రొత్త పోకడలకు మచ్చునకు చూడుడీగేయము:

"తెలుగు నింగి దారులలో
వెలుగు పులుగు రెక్కలార్చి

చిమ్మి పై చె తరతరాల
చిక్కని చీకట్ల నెల్ల"

ఎంత చక్కని శబ్ద చిత్రణమో, ఎంతటి భావగర్భితకృతియో చూడుడు. ఇటువంటి శబ్దచిత్రణములు చేసి మనసును రంజింప జేయుటలో ఈకవి ఘటికుడు.

సాధారణముగా ఈ కాలములో ప్రతిభావంతులయిన కవీంద్రుల ననుకరించేవారే సామాన్యముగా నవకవు లనేకులు. కాని దాశరథి అనుకరణశీలి కాడు. అతనిదారి అతనిది. ప్రజ్ఞతో తాను మలచుకొన్నదే తన త్రోవ. అందువల్లనే ఇతడు తెలంగానాలోని కవులలో అగ్రగామియై వారికి ఆదర్శప్రాయుడును, అనుకరణీయుడును అయినాడు. ప్రకృతము తెలంగానా నవ్యయువక సాహిత్య రాజ్యమున కధిపతి యతడు; తెలంగాణపు వైతాళికుడు.

కవిత్వమునకు ప్రధానమయినది భావావేశము. ఇది దేశాభిమాన పూరిత కవిత్వమునకు ప్రధానలక్షణము. ఇది దాశరథి కవిత్వములో పుష్కలముగ నున్నది. దేశాభిమానోద్దీపక కావ్య బహుళమయినదే ఇది వరలో చెప్పినట్లు ఈ "మహాంధ్రోదయము". ఈ గ్రంథములోని ఖండ కావ్యములు తెలుగువారి హృదయ కుహరములలో పూర్వాంధ్ర చారిత్రక స్మృతులు రేపి దేశాభిమాన ప్రదీప్తిని గలిగించు దీపకళికలు. ఈ గ్రంథములో ఇతరములైన ఖండకావ్యములును లేకపోలేదు. కాని పై నుడివిన యట్లు "మహాంధ్రోదయము" ఆంధ్రావని నవతరింపవలసిన మహాంధ్రో

దయ సౌభాగ్యలక్ష్మికి మంగళ ప్రబోధగీతిక; నిండారు భక్తి సంభరిత హృదయముతో నీ యువకవి యెత్తిన సాహిత్య నీ రాజనము. మహాంధ్రో దయ మెప్పుడగునా యని యువ్విళ్లూరుచు ఆత్రముతో ఎదురుచూచుచున్న తెలుగువారికీ కృతి హృద్యమయిన అమృత రసగుళిక.

దాశరథికి తెలంగానా మీద గల భక్తియు, రక్తియు అనుపమాన మైనవి. తెలుగు దేశమన్న, అందునను తెలంగాణమన్న ఒడలుప్పొంగి పోవు ఉత్కట భావావేశపరుడు. "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" యట. తెలంగాణ మన్న అతని కంత మమత. అతని కెంతటి గాఢాను రాగము. కాదామరి, అతడా వీణ మీటి ఎన్ని నూతన రాగములనో పలి కించినాడు. ఎన్ని వినూతన మనోహర గీతికలనో పాడినాడు. తెలంగా ణము అతనిని వలచి వలపించిన "సౌందర్యసీమ"; "కోటి అందాల జాణ." తెలంగాణా విముక్తిని సాధించుట కతడును యోధుడయినాడు; పలుబాములు పడినాడు; కడకు దర్పముతో విజయపతాక నెగురవైచి "తెలంగాణా విముక్తి"ని కంఠము సారించి పాడినాడు. కష్టములతో కుమిలిపోయిన హృదయ మగుటవల్ల పాటలో కొంత వాడిమి, వేడిమి, పలుకులో కొంత పారుష్యము చొప్పడినను పాట మాత్రము రస పరి పుష్టమై పాఠక హృదయరంజనము కావించుచు కర్ణపేయముగ నున్నది. తెలంగాణా చారిత్రక గాథను హృద్యమయిన కవితలో గర్భితముకావించి పాఠకుల కందిచ్చినాడు కవి. తన తెలంగాణమును పెట్టిన బాధలకు కడుపు ఎంతగానో మండి మల్లాడక పోయినచో వచ్చేదా ఈ క్రింది చరణాహతి ?

"విషము గుప్పించినాడు నొప్పించినాడు
మా నిజాంరాజు జన్మ జన్మాల బూజు."

"ప్రాణము లొడ్డి ఘోర గహనాటవులన్ పడగొట్టి మంచి మా
గాణములన్ సృజించ నెముకల్ నుసి జేసి పొలాలు దున్ని బో
షాణములన్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే తెలం
గాణము రైతుదే........"

అని కవి విజయదర్పముతో ఉద్ఘోషించుచున్నాడు. కవిది వశ్య వాక్కు. అది యన్యథా ఎట్లగును? ఈ మహోదయమును కోరియే కవి "విప్లవ శంఖ" మొత్తినాడు;

"........తెలుగు బాబులు నిద్దుర మేలుకోగ పో
రాటము సేయగా, కరకు రాచరికమ్మును కూలద్రోయగా
కోటి గళాల నొక్కకడ గూరిచి........"

పాటలు పాడినాడు. తన కోర్కె సఫలమైన పిదప ఇప్పుడతను చున్నాడతడు:

"కలిపి వేయుము నా తెలంగాణ తల్లి
మూడుకోటుల నొక్కచే ముడి బిగించి."

"కోటి తమ్ములకడ రెండు కోట్ల తెల్గు
టన్నలనుగూర్చి వృత్తాంత మందజేసి
మూడు కోటుల నొక్కచే ముడి బిగించి."

అని ఆలపించు చున్నాడిప్పుడు ఈకవిశేఖరుడు. మహాంధ్రోర్వరను సాధించు సాధనలో ఈ కవికుమారుని ఉద్బోధ ఇది :

"కృషికుల్ కార్మికులెల్ల రొక్కటిగ సంగీతమ్ములంబాడు డు
డువిమ్మిషితాంతః కరణమ్ములన్ తెలుగుభూమింగూర్చి........

........................................................

విషతుల్యంబగు భేదభావములు పృథ్విన్ మాసిపోనిం డహో !"

ఎంతటి గాఢ దేశాభిమానము ! మహాంధ్రోదయమున కెంతటి ఉత్కంఠ ! అందువల్లనే అతనికి—

"తెలుగు ఊరులు
తెలుగు వారలు
ప్రతిఫలించే మహాకావ్యం"

కావాలి, అది-

"........నవశిరీష
ప్రసవ మంజుల భావ గుంభిత
కావ్యరాజము నవ్య జగతీ
సవ్య మార్గ ప్రదర్శకము"

కావాలి. అతని యకుంఠిత విశ్వాస మెట్టిదో చూడుడు :

"నవయువక రక్తనాళాల నడుమ పారు
నూత్న చైతన్యధార........"

అనే నూనెతో

"చీకటుల నింపుకొన్న మృత్పాత్రకరండ
మీ ఇలాగోళకమ్ము వెల్గింతు నేను"

అనుచున్నాడు. ఇంతటి గాఢ విశ్వాసముగల కవి యభీష్టము నెరవేరకుండు టెట్లు?

"మహేంద్రోదయము"లోని దాశరథి కావ్యము లన్నియు దేశాభిమానపూరితము లయినవే. ఈ కావ్యజలదము లన్నిటిలోను ఆంధ్రదేశ చారిత్రక సంగతులు తటిల్లతలట్లు మిరుమిట్లు గొలుపుచు మెరసి మన హృదయాకాశమును రేఖా బహుళమైన పురాతన చారిత్రక దీప్తితో ఉత్తేజితము కావించి ఉల్లాసము కలిగించుచుండును. తత్తత్ స్మృతిజన్యమైన దర్పానుభూతి మనకొక నూతన చైతన్యము నుద్దీపింప జేయుచుండును.

కవికి భావావేశమున్నంత మాత్రాన చాలదు. మధువులోని మధురిమవలె అది పాఠక హృదయమును రంజింపజేయగల చతుర రసవత్కవితా సృష్టిలో లీనమై యుండవలెను. "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య"మ్మనియే ప్రాచీనాలంకారికుల కావ్యలక్షణము. దోషరహితముగను, అలంకార యుక్తముగను, గుణభరితముగను నున్నదే కావ్య మన్నమాట నిజము. కావ్యమునకు ప్రధానమైనది చమత్కారము. చమత్కారములో గుణ శబ్దాలంకారములు మొదలుకొని రస ధ్వనుల వరకుగల కవితా గుణములన్నియు ఇమిడి యున్నవి. రేచెర్ల సింగభూపాలుని ఆస్థానకవియైన విశ్వేశ్వర కవి చంద్రుడు తన చమత్కార చంద్రికలో చమత్కారము నిట్లు వివరించుచున్నాడు :

"చమత్కారస్తు విదుషాం ఆనంద పరివాహకృత్
గుణం రీతిం రసం వృత్తిం పాకం శయ్యాం అలంకృతిమ్
సప్తైతాని చమత్కార కారణం బ్రువతే బుధాః".

లోకోత్తరాహ్లాదమును గలిగించునదే చమత్కారము. దీని ననుసరించి వచ్చినదే జగన్నాథ పండితరాయల కవిత్వ నిర్వచనము - "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య" మ్మని (రమణీయతాచ లోకోత్తరాహ్లాద జనక జ్ఞానగోచరతా: లోకోత్తరత్వం చాహ్లాదగతః చమత్కారాపరపర్యాయః అనుభవసాక్షికో జాతివిశేషః.) కవిత్వములో చమత్కారము లేకపోయినను నవ్యత లేకపోయినను అది పాఠక హృదయ ఆకర్షకమును గాదు; రంజకమును కాదు. శబ్దములు ప్రాతవే; ఎందరు కవులో ఇదివరకు వాడినవే. వాటి యర్థములును రూఢములై ప్రాతబడినవే. కాని కవి తన ప్రతిభా విశేషముచేత, తన ప్రజ్ఞా వైభవముచేత చిత్ర విచిత్ర కల్పనాలంకార రీతుల "ముత్తైపు సరులు పోహళించిన లీల తమ లోన దొరయు శబ్దములను కూర్చి" ఆ ప్రాతమాటలకు ఒక క్రొత్త శోభను, కవిత్వమున కొకవిధమైన నవ్యతా మధురిమలను సమకూర్చును.

ప్రాచీనాంధ్ర మహాకవులు ఎన్నెన్ని చమత్కార కల్పనలనో చేసినారు. సాధారణ కవులు వారి ననుకరించి త్రొక్కినదారులే త్రొక్కి, చేసిన కల్పనలనే చేసి, తొడగిన తొడవులే తొడిగి - తుద కన్నిదారులు, అన్ని పరికల్పనలు ముగిసి పోయిన మీదట నవ్యతా గుణముకొరకే వారు గర్భ బంధ కవిత్వములలోనికి దిగినారు. దానితో కావ్యములు నీరసములై కవితాగుణ మంతరించి యెన్నికలోను, మన్నికలోను నికృష్టములైనవి.

కాని ఆధునికాంధ్ర కవిచంద్రు లా పంథను మార్చి రసావిష్టములైన క్రొంగ్రొత్త సమాస, పద బంధములతో తెలుగు కావ్యసుందరికి క్రొత్త శోభను వెలయించినారు. ఈ విధమైన నవ్యాలంకార పదబంధ చమత్కారము దాశరథి కవితనిండ మెండుకొనియున్నది. ఈ యుదాహరణములు చూడుడు : "వెలుతురు బాకు తాకిడికి విచ్చిన చిక్కని కాలరాత్రి"; "ఆవేశములేని ఈ బ్రతుకు వీధుల వెచ్చని దీప మాలికా పేశలకాంతి నింపు దము పెక్కు తరాల తమమ్ము లింకగన్"; "మధుమాసము హాస మొనర్చినట్లు". ఇంకను ఈ క్రింది చరణములు గాంచుడు :

"నాడు మానవతీ నయనమ్ములందు
నాగసర్పాలు బుసకొట్టి నాట్యమాడె".

• • •

"పడతి చూపులోన బాణాలు పదనొత్తి".

• • •

"శిశిర వాత ఘాత జీర్ణమైన
నగ్నతనువులందు అగ్ని చేలమ్ములు
కట్టుకొనె పలాశగణ మదేల ?"

అచ్చపు తెలుగు బిడ్డడు దాశరథి. ముచ్చటయిన ఈతని తెలుగు పలుకుబడి చూడు డీ క్రింది చరణములలో :

"..............................నిప్పుల్ గ్రక్కు ఫాలాక్షిలో
పిడుగుల్ పిల్లలు పెట్టుకొన్నటు మహా మేఘావళీ గర్జనల్
చెడుగుల్లాడి భయమ్ము గొల్పునటు దోచెన్ శంఖుఢక్కాధ్వనిన్".

ఈ గ్రంథములో క్షమామూర్తి, కాపయనాయకుడు, కపోతీ సందేశము, శిల్పి మొదలైన రసవత్కృతు లనేకములు చదివి, ఆనందింపవలసినవే. ఒక్కొక్క కావ్య మొక్క విరిసోనవాన. ఇందలి పద్యములు వజ్రాల తునకలు; పలుకులు కప్పురపు బలుకులు. దాశరథి కవితాధార అనర్గళమై గంగాఝరీ సదృశమైనది.

నాకువలెనే దాశరథికిని "విశాలాంధ్రము" కంటె "మహాంధ్ర" పదమే రుచించినది. 'విశాలాంధ్ర'కన్న 'మహాంధ్రా'భిధయే పరిగ్రాహ్యమేమో. తిలింగకూడ యోజింపదగినదే.

మూర్తీభవించిన తెలుగు తనమే దాశరథి. అతడు మహాంధ్రోర్వర నున్న తెలుగువారి కందరికి మంగళాశంసనముగా సమర్పించుచున్న ఉపద ఈ "మహాంధ్రోదయము".

ఇంకను చక్కని కావ్యములు రచించి దాశరథి సాహిత్య సేవా సముదీర్ణుడై పేరు ప్రతిష్ఠల నార్జించి వర్ధిల్లవలెనని కోరుచున్నాను.

*మద్రాసు, పురశవాకము,*
*మన్మథ జ్యేష్ఠము.*

# కృతజ్ఞతలు

'అగ్నిధార' 'రుద్రవీణ' మున్నగు కావ్యాలద్వారా తెలంగాణా సాహిత్య జగత్తులో నూత్న శకాన్ని స్థాపించిన మహాకవి శ్రీ దాశరథి గారు గడిచిన నాలుగేండ్లనుండి భారతి, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, స్రవంతి మొదలగుపత్రికల్లో ప్రచురించిన పద్యావళిని సంపుటీకరించి 'మహేంద్రోదయం' గా ప్రకటిస్తున్నాము. ప్రాచీన అర్వాచీన విద్వజ్జనుల ప్రశంసలకు పాత్రములైన దాశరథిగారి పద్యాలను ప్రకటించే భాగ్యం కలిగినందుకు తెలంగాణా రచయితల సంఘం ఎంతో గర్విస్తున్నది.

'మహేంద్రోదయా'నికి దయతో ప్రస్తావనలు పలికిన సరససాహిత్య మూర్తులు, ఆంధ్ర, హైద్రాబాదు ముఖ్యమంత్రులు అగు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి మరియు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగార్లకు కృతజ్ఞతాభివందనములు. బృహత్పీఠిక సమకూర్చి కావ్యశోభను ఇమ్మడింపజేసిన సుప్రసిద్ధ చారిత్రకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి మా నమోవాకములు. కావ్య ప్రకాశనంలో విశేషంగా తోడ్పడిన శ్రీ ఉరుపుటూరి రాఘవాచార్య, శ్రీ కపిల కాశీపతి, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ వేమూరి ఆంజనేయశర్మ గార్లకు ధన్యవాదములు. చిరంజీవులు అన్నపూర్ణ, విద్యాసాగరులకు ఇటీవల జనగామలో జరిగిన వివాహ సందర్భాన ఈ గ్రంథ ముద్రణకు కావలసిన ధన సహాయం చేసిన శ్రీయుతులు చీల రాజయ్య (జనగామ), మంచాల నారాయణ (భోనగిరి) గార్లకు కృతజ్ఞతలు.

అందమైన ముఖచిత్రాన్ని అందించిన చిత్రకారులు శ్రీ వేంబు గారికి, గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించిన అజంతా ప్రింటర్సు వారికి కృతజ్ఞతలు.

*తెలంగాణా రచయితల సంఘం*
హైదరాబాదు.
1-9-1955

ఇట్లు
సి. నారాయణరెడ్డి
ప్రధాన కార్యదర్శి



# ఆశీస్సులు

*చిరంజీవులు అన్నపూర్ణ, విద్యాసాగరుల*
*వివాహ మహోత్సవ సందర్భమున*



ప్రణయ మనెడు కుసుమ వల్లరి హృదయాల
పందిళులను ప్రాకి బ్రతుకులందు
నవ వసంత కాంతి చవుకళింపగ జేసి
తరుణదంపతులను తన్పుగాక.

ఒకరికొక్కరూత నొసగి ఆనంద సౌ
ధాగ్రభూమి చేరుటవసరమ్ము ;
ఏకతాబలాన కెనయగు బల మెద్ది ?
జగతి సర్వకార్య సాధకమది.

శిలలలో సుధాధునుల నూర్పు సాహిత్య
వైభవమ్ము తెలియవలయు మీరు
ఇరుకు గదులవోని ఈ జీవితమ్ములు
గగనములయి విరియ గలుగునటుల.

# తెలంగాణ

కోటి తెలుగుల బంగారు కొండక్రింద
పరచుకొన్నట్టి సరసులోపల వసించి
ప్రొద్దుప్రొద్దున అందాల పూలు పూయు
నా తెలంగాణతల్లి కంజాతవల్లి.

ఎల్లొరా గుహాలందున పల్లవించి
వేయిస్తంభాల గుడిలోన విరులు పూచి
శిల్పి యులిముక్కులో వికసించినట్టి
నా తెలంగాణ, కోటి అందాల జాణ.

మూడు కోటుల దేవతామూర్తులందు
కోటిమంది వసించెడి హాటకావ
నీ మహాఖండ మీ రమణీయభూమి
నా తెలంగాణక్షేమ, సౌందర్యసీమ.

మూగవోయిన కోటి తమ్ముల గళాల
పాట పలికించి కవితాజవమ్ము కూర్చి
నా కలానకు బల మిచ్చి నడపి నట్టి
నా తెలంగాణ కోటిరత్నాల వీణ.

# మహాంధ్రోదయం

"చిమ్మచీకటిలో తూర్పు నెమ్మిమీద
దివ్వె యొక్కటి వెలిగించి, రువ్వినావు
వెలుతురుల బాకు నాకాశ వీథిలోన
ఎవరవయ్యా ? ప్రగాఢ సాహిత్యమూర్తి !"

"నీ వెరుగవె శ్రీరాముడ
నేను మానవుడనె లెమ్మ
నిద్రాణాంధ్ర ధరాస్థలి
నేడు మేలుకొల్పగలను.

వెలుతురుబాకు తాకిడికి
విచ్చిన చిక్కని కాలరాత్రి గుం
డెల జిలుజిల్లనన్ రుధిర
నిర్ఝరి పారె, దిగంగనా ముఖ
మ్ముల నవకుంకుమ ప్రభలు
మొల్చెను తామరమొగ్గ లట్లు, త
ల్పాలు తెరువుందు, రండు,
పిలువుందు శయించినవారి నెల్లరన్.

తరుణీ సుందర దంత ఘట్టన లసత్
తాంబూలరాగ ప్రభా
స్ఫురణీ యాధరబింబ మట్టు లదిగో
సూర్యుండు ప్రాచీ ధరా
ధర కూటాగ్రమునందు కూడుచుని
సౌందర్యమ్ము చేకూర్చె ను
ర్వరకున్; నిద్దురచెమ్మ బాసిన
జనంబా ! సుప్రభాతంబిదే."

అని యీ మానవు డెవ్వడో తెలుగు
 పద్యాలందు ప్రాభాత మా
జన గీతావళి పాడి మేల్కొలుప
 నేత్రాల్ విచ్చి తొల్సారి వె
ల్గును దర్శించితి తెల్గుగా, భయద
 రాత్రుల్ పోయి ఇన్నాళ్ళ కిం
టిని, ఇల్లాలిని, పిల్లజెల్లలను
 గంటిన్ స్వర్గసౌఖ్యమ్ముగా.

నా తల్లి కృష్ణవేణమ్మ కన్నీరొత్తి
 కొనుచు నాపై ప్రేమ మినుమడించె
గోదావరమ్మ సమ్మోదమ్ముతో నాకు
 ముఖమార్జనకు జలమ్ముల నొసంగె
తుంగమ్మ తన పైటకొంగుతో నా మోము
 తుడిచి నిద్దుర చిన్నె లడచివేసె
పెన్నమ్మ తన పయఃపీయూషము నొసంగి
 ఆకలి మంట చల్లారగొట్టె

మూడు చెరగుల నేలల మూడు కోట్లు
ముడివడిన యట్లు కన్నులముందు తోచె;
అందలము నెక్కి, యావజ్జనాళి మెచ్చ
సుందరోషస్సు వచ్చె వసుంధరకును.

అంధకార శయ్యాగృహా
మందు గురకపెట్టు జగతి
సముజ్జ్వల ప్రభాత పా
త్రమున ప్రభామధువు గ్రోలె.

నిద్దుర మేల్కొనెను జగతి
నిశా విశాల కారాగృహా
నిగళ గళ ఘలంఘలలు
నీరవమ్ము లయ్యె నేడు.

తెలుగు నింగి దారులలో
వెలుగుపులుగు రెక్క లార్చి
చిమ్మివైచె తరతరాల
చిక్కని చీకట్ల నెల్ల.

తెలవారుట కన్న నాకు
గల కాంక్ష మరొండు లేదు
ప్రతిమనిషి కరాలు సాచి
శిర మూచి ధరిత్రి నేలు.

ఎన్నాళ్ళకు తెల్లవారె !
ఎన్నాళ్ళకు కన్నుదూరె !
వెలుగు, వెలుగు, వెలుగు, వెలుగు !
తెలుగు, తెలుగు, తెలుగు, తెలుగు !

ఏది కాకతి ? ఎవతి రుద్రమ ?
ఎవడు రాయలు ? ఎవడు సింగన ?
అన్ని నేనే, అంత నేనే,
వెలుగు నేనే, తెలుగు నేనే !

అరిశిరస్సుల నుత్తరించిన
అలుగు నేనే, తెలుగు నేనే !
అఖిల జగములు చుట్టి వచ్చే
పులుగు నేనే, తెలుగు నేనే !
తెలుగు నేనే, వెలుగు నేనే !

నాకు కావలె నవశిరీష
ప్రసవ మంజుల భావ గుంఫిత
కావ్యరాజము, నవ్యజగతీ
సవ్య మార్గ ప్రదర్శకము.

శ్రమిక హృదయాంత ర్మహో జడ
వాగ్ని ఉరుకులుపెట్టు దారులు,
కృషిక సీర నిశాత ముఖమున
క్రుమ్మినట్టి పొలాల బారులు,

తెలుగు ఊరులు
తెలుగు వారలు
ప్రతిఫలించే మహాకావ్యం
నాకు కావలె, నాకు కావలె.

నాకు కావలె మహేంద్రోర్వర;
రండి అన్నల్లార తూరుపు
దారి కెదురుగ ద్వారబంధము;
మనిషి మనిషి మనస్సు దారుల
రాగబంధము, రాగబంధము.

ధగధగ దీపికా తత చతుర్ధ్య ప్రభా
ఘనులు నా కనులలో కనుము, కనుము
రమణీయ కాకతి రాజ్య ఘంటా ఘణం
ఘణలు నా గళములో వినుము, వినుము
వినుము ఘాణంధణద్ విద్యాపురీ రాజ
భేరిక నాదు హృత్ప్రతిభూమి,
కనుము కాపయనాయకుని శౌర్యదావాగ్ని
నా లేఖినీ ముఖాంతరమునందు,

నా తెలంగాణ దిగ్దిగంతములదాక
పరచినట్టి జ్యోత్స్నామయ ప్రభలలోన
పోతకవినుండి నాదాక పొంగి పొరలె
కావ్యవారాశి; కనుము, లోకమ్మునందు.

నేనురా తెలగాణ నిగళాలు తెగద్రొబ్బి
ఆకాశమంతయే త్తరచినాను,
నేను రాక్షసి గుండె నీరుగా పద్యాలు
పాడి మానవుని కాపాడినాను,

నేను వేస్తంభాల నీడలో నొక తెల్గు
　　తోట నాటి సుమాలు దూసినాను,
నేను పోతన్న చిందిన సుధా విప్రుష
　　మ్ములు నా కలమ్ములో బోసినాను

కోటి తమ్ములకడ రెండు కోట్ల తెల్గు
టన్నలను గూర్చి వృత్తాంత మందజేసి
మూడు కోటుల నొక్కచే ముడి బిగించి
పాడినాడ మహాంధ్ర సౌభాగ్య గీతి.

నా యింటి చిన్నది, నడుముసన్నముది, క
　　న్నుల తెల్గు సిగ్గులు మొలకలెత్త
నావైపు సూచి నన్ వలపించుకొన్నది
　　పాతకాలంపు సౌభాగ్యగరిమ,
క్రొత్తనాటి వెలుంగు కూడగట్టిన యట్టు
　　లుంగరమ్ముల జుత్తు నొత్తి కట్టి
తెలుగు సింగారాలు తలబ్రాలుగా జార
　　పూలు ముడిచి ముద్దరాలు వోలె

నవ్వుల వెలార్చి నా యింటి నడుమ సౌర
దీపమును కూర్చి పెట్టిన తెలుగు పిల్ల,
కన్నడము కన్నడంపని కవనలక్ష్మి,
రసభర విజృంభమాణ పూర్ణ కుచకుంభ.

నాలో ఆంధ్రసరస్వతీ పద
సువర్ణ స్వచ్ఛ మంజీర నా
దాలన్ నింపి కవిత్వ భూరుహ
సుమాంతర్ బంభరీ గీతికా
జాలమ్మున్ పలికించి మించి
తెలుగుం జండాలు దిగ్భిత్తికా
గ్రాలన్ గ్రాలగ ఇల్లు చేరినది
ఆంధ్రశ్రీ మహాలక్ష్మియై.

ఈనాడు మహాంధ్రోదయ
మైనది, కోట్లాది జనము
తెలుగు లక్ష్మి పాదాలకు
వెలుగుల పారాణి నిడిరి.

# కోటి గొంతులు

మామిడి పాడినట్లు, మధు
మాసము హాస మొసర్చినట్లు, శ్రీ
రాముని ప్రాణదానమున
రాగిచె తెల్గుల యింటిలోని ఆ
రామము పూలతో, ఫల
భరమ్మున వంగిన భూజరాజితో
ప్రేమముతో, మృదు ప్రణయ
రేఖలతో, అనురాగ కాంతితో.

ఓరుగల్ కోటపై ఒలసి యాడిన నాటి
తెల్గు జెండా నేడు తిరిగివచ్చె,
రాజరాజనరేంద్రు రతనాల మేడ వి
చ్చిన తెల్గువెల్గు వచ్చినది మరల,
కృష్ణరాయలవారి ఉష్ణీషమును బోలి
తెలుగు భానుడు నేడు తెలివిదేరె,
ముసునూరి కాపన్న మును ఢిల్లి సులతాను
గెలిచి రాష్ట్రము గొంత తెలిసె నేడు,

చలిచి వాలిచియున్న నా తెలుగు జనము
ఉన్నతోన్నత పర్వతాలో యసంగ
చలిలు పైకెత్తి తమ యింటి చలుపు తెరచి
కాపురము నేయ మొదలిడ గలిగినారు.

కోటి గొంతులు విచ్చి మేటి తెలంగాణ
జోహారులను పల్కజొచ్చె నేడు,
మంజు మంజీరా కుమారి రాజకుమారి
వోరె నీటుగ తెల్గు పొంగు చూపె,
వేకంబముల గుడి ప్రిదిలిన చన గాథ
మరచి క్రొత్త వెలుంగు పరచె దెసల
ఎనమిది మండలా లేక కంఠమ్మున
తెల్గు రాష్ట్రమునకు దివ్వెలెత్తి .

మంగళారాత్రికమ్ముల పొంగిపోయె;
ఆంధ్రరాష్ట్రము వచ్చె, మహాంధ్రరాజ్య
మేరుపడు రోజు పొలిమేర జేరి నిలిచె
నా తెలంగాణతల్లి ఆనంద పడగ.

కష్టాలే బ్రతుకై తెలుంగులకు
        సౌఖ్యం బింతయున్ లేని ఈ
దుష్టాస్పష్ట యుగంబునం దుదయమందున్
        రాష్ట్రి మంథోధరా
శ్లిష్ట ప్రాగ్దిశ సంధకారముం
        విశ్లేషించి బాలార్కుఁ డు
త్కృష్ట స్వీయ కరాంచిత ప్రభలతో
        దేదీప్యమానుండుగాన్.

బలమగు ముష్టిబంధమున
        బ్రద్దలుగొట్టి తరాలనాటి ర
క్తుల పెను ఖైదు, దాస్యమును
        తుత్తునియల్ పొనరించి క్రొత్త వె
ల్గుల జలకమ్ము లాడి తనరున్
        తనవారల కిల్లొకండు కా
వలె నని పట్టుపట్టి పెర
        వారల కాంధ్రుడు దారి చూపెడున్.

భాషారాష్ట్రమటన్న వాంఛితము
నుత్పాదించి మా తెల్గువా
డాషామాషి కబుర్లుగాక నిజమౌన
క్షేమ కల్పించినన్
రోషం బందక నుద్యమించి గెలిచెన్
లోకంబు హర్షింప ప్ర
త్యూషం బిన్ని దినాల కైనది స్వరా
ష్ట్రోద్యాన భాగంబునన్.

కృషికుల్ కార్మికు లెల్ల రొక్కటిగ
సంగీతమ్ములం బాడు డు
న్మిషితాంతఃకరణమ్ములన్ తెలుగు
భూమింగూర్చి, ఆనందపున్
చషక మ్మెత్తుడు, స్వీయ రాష్ట్ర జనతా
సౌఖ్యార్థమై త్రావుడీ!
విషతుల్యం బగు భేదభావములు
పృథ్విన్ మాసిపోనిం డహో!

నా తెలగాణ, కోటి రత
నమ్మల వీణ మహాంధ్రరాష్ట్రి సం
గీతము పాడె నేడు, పలి
కించెను మూకగళాలు కోటి; ఆ
శా తరుణమ్ము జీవితము,
సఖ్యమునన్ విలసిల్లు సౌఖ్యమన్
గీతము తెల్గువారి గిలి
గింతలువెట్టగ వీను సోకెడిన్.

అరుణోదయ మిది మూడు
న్నర కోటి తెలుంగు జనుల నానాటి నిశా
వరణమ్మున; విరచింపుడు
తరుణీ తరుణులు ! విభాత తరుణారుణిమల్

కోటి కంఠాలతో తెలుంగులు సతమ్ము
ఆంధ్రరాష్ట్రావతరణ శుభావసరము
గోరుచున్నారు; కలిసిపో గోరుచుందు
రగ్రజులతోడ వీరైనయంత వడిగ.

# శిల్పి

దాగిలడీసి ఈ కఠిన
        శైల శిలావళి పైడి తీవెగా
లాగెద వెట్టులన్న నటులన్;
        శిలకే గిలిగింతగా ఎలో
రా గుహాలకా మలంచిన
        విలాసపు నీ యురి ముక్కులోపలన్
దాగిలిమ్రుచ్చులాడె నవతా
        విలసత్ కవితావతారముల్.

రాలు వరాలు చేసెడి
విలాసము నీ యులిలో కుదించి, దే
వాలయ గోపురాగ్రముల
యందు కళాపతి పెంచి, పర్వతా
గ్రాల సురాంగనా నటనకై
రసశాలలు సంతరించి, కా
వ్యాలకె రూపుదించిన
మహామతి! శిల్పకళా పురోగతీ!

నిను గని కొండలన్ని రమణీ
కుచపాళికలై కపోలమో
హాస ఫలకమ్ములై భ్రుకుటులై
కుటిలాలక జాలమై సురాం
గనలయి రూపుదిద్దుకొనగా
ఉలితో అమృతమ్ము చల్లి జీ
వనములు పోసిపోయెదవు,
బ్రహ్మవు శిల్పికులావతంసమా!

సుత్తెలు దండీ దెబ్బలకు
        స్రుక్కిన కొండల పింపు చెల్లి నో
రెత్తి ఎలుంగుపెట్టి 'నివు
        డీ వెటువంటి మనోజ్ఞరూపకం
బెత్తు మటన్న సెత్తమహె !
        ఎందుల కిట్టుల మట్టిమట్టిగా
మొత్తెదవోయి శిల్పికుల
        భూషణ ! శైలశిలా ప్రపేషణా !'

చెక్కిన రాతి కంబములు
        చిందెడి మంజుల మోహన స్వరా
లుప్కు సరాలపై పలుకు
        లొత్తిన రీతి ధ్వనించు నంట ! ఏ
చెక్కులతో ఉలిన్ గిలక
        రించితివో శిలపై కళానిధీ !
అక్కట ! రాతిలో హృదయ
        మద్దితివో రసరాగ సృష్టికై. . .

వెన్నవలెన్ కరంగును
      స్రవించును వెచ్చని కంటినీటిగా
నిన్నగపాళి, క్రొమ్మెఱుగు
      లీనుచు శిల్పకళా విలాస సం
పన్నత గుల్కఁ నే యులిని
      బట్టిన మోహన బాహుదండమున్
గన్నపు డెల్ల; ఎంత మొన
      గాడవురా శిలనే కరంచగా !.

ప్రతి వికారశిలయు ప్రతిమయై వెలుగొందు
పడతివోలె కులికి వలపు రేపు
నీ కరావలంబ నిభృత మైనపుడెల్ల
రాతిరాతిలోన నాతి తోచు !

# మంగళగీతి

మంగళగీతి పాడెద
        హిమాచల శృంగ సరత్ సురాపగా
భంగ తరంగ రంగముల
        పాదము లూని నటించు బాల సా
రంగధరున్ వినీల చికు
        రమ్ములలో ధరియించినట్టి భ
స్మాంగుని ఫాలనేత్రము
        నవాగ్ని కణమ్ముల జిమ్ము దారులన్.

కుంకుమ చిల్కరింతు నిదిగో!
        పరిగర్జిత మేఘ మాలికా
పంకిల రోదసీకుహర
        ఖాగ దివాంధ భయంక రార్భటీ
సంకుల కాళరాత్రి తెర
        జారిన నాటనశాల వంటి ప్రా
గంకమునన్ మదీయ ఘుసృ
        ణారుణ హస్త తలద్వయమ్మునన్.

వెచ్చని మొల్లపూలు కురి
పింతును శైశిర శీతవాత ఘా
తోచ్చలి తాతిశుష్క లతి
కోద్గత నగ్నతతో చెలంగు ఈ
గచ్చ పొదల్ గలట్టి వన
కన్యక హాస్యముఖాంగణమ్మునన్
పచ్చని మాధవ ప్రభువు
బాహువు రెత్తిన పూలబుట్టతో.

వెన్నెల కాగడాలకు
ద్రవించెడి చీకటి కొండపైన కూ
ర్చున్న అనంత తారకలు
రొప్పుచు రోజుచు జారివచ్చి ఈ
పున్నమనాటి చెంగలువ
పూవులవోల్ వికసించెనో ! యనన్
మిన్నులు దించి తెచ్చెదను
నిమ్న జలాశయ గర్భభూమికిన్.

## నటస్వామి

చరమ గిరికూట భాగాన తెరచినారు
నాట్యశాలలు; సంధ్యా పినాకపాణి
ఘల్లుఘల్లున కాళ్ళకు గజ్జెకట్టి
యాడి లోకాల నాడించు నవసరమున.

బాలచంద్రుడు శృంగాలు పంచికొనగ
చెంగుచెంగున గంగమ్మ నింగి నెగయ
నాగసర్పాలు దాహాన నాల్క సాచ
నాట్యమాడెను సంధ్యా పినాకపాణి.

ఖర్వమైపోయె కైలాస పర్వతాలు,
మేరుచాపము వంగి కంపింప దొడగె,
పాణినీయాలు డమరు శబ్దాన పలికె
నాట్య మాడగ సంధ్యా పినాకపాణి.

భూత భేతాళ గణములు చేతు లెత్తి
తలలు విరబోసి ఎగసి నృత్యాలు చేసె;
తన్మయంబయ్యె బ్రహ్మాండ తండ మెల్ల,
అనుకరించెను శివుని పాదాభినయము.

శివుని ఫాలాన పెద్ద కార్చిచ్చు లేచి
గగన కబరీభరమ్మును కప్పుకొనగ
చెంగుచెంగున నెగయు సారంగ మొకడు
శివ శిరశ్చంద్ర కేదారసీమ దోచె.

సగము దేహాన పర్వత సార్వభౌమ
పుత్రికారత్న మందాలు ప్రోదిసేయ
సగము దేహాన విషనాగ భుగభుగముల
నాకు కనుపించె సంధ్యా పినాకపాణి.

కుడిహస్తమ్మున శూలమెత్తి పది
దిక్కుల్ పిండిగా ఢక్క చ
ప్పుడు గావించె మరొక్క హస్తమున;
నిప్పుల్ గ్రక్కు ఫాలాక్షిలో
పిడుగుల్ పిల్లలు పెట్టుకొన్నటు మహా
మేఘావళీ గర్జనల్
చెడుగుళ్లాడి భయమ్ము గొల్పునటు
దోచెన్ శంఖ ఢక్కాధ్వనిన్.

# గుండెలో దీపాలు

ఈ శిథిలాలయమ్మున
జనించిన చిక్కని శర్వరీ తమో
రాశి శిఖాగ్రసీమ పదరా!
ఒక దీపము పెట్టివత్తము; ఆ
వేశములేని ఈ బ్రదుకు
వీథుల వెచ్చని దీపమాలికా
పేశలకాంతి నింపుదము
పెక్కుతరాల తమమ్ము లింకగన్.

ఈ దీపమ్ములచుట్టు చీకటులు
పోనేలేదు, దయ్యాలటుల్
పాటల్ కట్టుచు కూరుచున్నవి;
నిశాపక్షీంద్ర పక్షమ్ము లెం
తో దూరానకు గాలివీచినవి,
ముద్దుల్ గుల్కు దీపమ్ములం
దేదో చల్లదనమ్ము ప్రాకినది,
లెమ్మా! వేడి పుట్టింపగన్.

దూరదూరాల దీపాల తోరణాల
భరతవీరుల నెత్తుటి వరద కలదు;
అందులో విచ్చె బంగారు టంబుజములు
భరతమాతృ పదమ్ముల వ్రాలుకొఱకు.

గుండెలను పిండి ప్రమిదలనిండ స్నేహ
మొలికి ప్రేమాగ్ని కళికలు నిలుప రమ్ము!
చీకటులు ప్రావి మ త్తిల్లి జీర్ణకుటిని
గుఱకవెట్టెడి జనుల మేల్కొలుప లెమ్ము!

ఇచట నిరుపేదవాడు కోపించినాడు
దివ్య దీపావళీ దీప దీధితులటు;
ప్రేయసీ హృదయాంతర వీథులందు
ప్రియుడు వెలిగించినాడు దీపికలు నేడు.

కోటి మందార పుష్పాల తోటవోలె
దీపికా తోరణమ్ములు తేజరిల్లె;
యుగయుగమ్ముల చీకటి పొగల ఆరలు
తగులబడిపోయె దీపాల సెగలలోన.

అస్మదంగనా తరుణాధరాంగణమున
మొలకనవ్వులవోలె దివ్వెలు లసించె;
నీల కాసారమున రమణీయ కమల
కళిక లటు దీపమాల చీకటుల దోచె.

నవయువక రక్తనాళాల నడుమ పారు
నూత్న చైతన్యధారయే నూనె గాగ
చీకటులు నింపుకొన్న మృత్పాత్ర కరండ
మీ ఇలాగోళకమ్ము వెలిగింతు నేను.

# పూలలో జ్వాలలు

నన్ను రమ్మని పిలుచుకొన్నావు నాడు
వద్దు పొమ్మని నేడు కోపపడినావు
నవ్వుకొన్నాను నేను ఆనాడు కూడ
నవ్వుచున్నాను నేను ఈనాడుకూడ.

నాడు నీ యింటివెనుక పున్నాగ నవ్వె
నేడు నీ యింటిముందు కన్నెర్రజేసె
సార చారు శృంగార మందార సుమము,
అరుణ తరుణ ప్రభాత భాస్కరసమమ్ము.

అంత చల్లని నీ గుండెయం దిదేల
కోప మగ్నికీలామాలి కోపమమ్మ ?
ఇంత చల్లని ఈ పూల చెంత ఏల
పెకలివచ్చు వక్షోజాల వెచ్చదనము ?

జ్వాలజ్వాలయు పూవుగా చల్లవడును
పూవు పూవు జ్వాలా జిహ్వ పోల్కి నెగయు
నాల్గు దిక్కుల వెచ్చందనమ్మె లెమ్మ !
నాల్గు వాడల చల్లందనమ్మె సుమ్మ !

నీవు వెచ్చని శయ్యవైనావు నాకు
నేను నీకు గామైన పానీయ మైతి
అన్న మైతిని నేను నీ కమృత మైతి
వీవు నాకు బుభుక్షాఽసహిష్ణువునకు.

ఘోర కారాగృహమ్ముల కూలద్రోచి
బయలువెడలిన రాక్షస ప్రకృతి వాని
కదలనీకుండ బంధించ గలుగు నీదు
కోమల భుజా భుజం గోపగూహనమ్ము.

నీవు నే నని ఎవరేని విలువదీసి
వేరువేరుగ పేరులు పెట్టిరేని
పార్వతీ పరమేశ్వర స్వామి చూపి
నవ్వుకొంద మమూస పున్నమల పోలె.

కనబడిన 'తెల్ల' యెల్ల శృంగార మనుచు
కంటబడు 'నల్ల' యెల్ల వికార మనుచు
మూల్గు లోకాన కెయ్యది వెల్గుచూపు?
నీ సితాసిత లోచనాంతికము గాక!

# తెలంగాణా విముక్తి

అవి తెలంగాణలోన దావాగ్ని లేచి
చుట్టు ముట్టిన భీకరాశుభ దినాలు;
అవి నిజాము నృపాలుని అండదండ
చూచుకొని నిక్కినట్టి పిశాచికలలు.

నాడు మానవతీ నయనమ్ములందు
నాగసర్పాలు బుసకొట్టి నాట్యమాడె;
నాడు మానవతయు నవనాగరకతయు
తన్ను దిన్నవి రాక్షసత్వమ్ము చేత.

పరశు నిశాతధారలను
　　పచ్చనిగడ్డి యెదిర్చినట్లు, రా
చరికపు టుక్కుచట్టమును
　　శాంతిగ ధిక్కరణ మ్మొనర్చె
ఉస్సురనెడి పేదవాడు, కడు
　　సుందరమైన తెలుంగు నేలపై
పరుడెవడో నిరంకుశుని
　　భాతి ప్రభుత్వము సేయ సైచునే ?

తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైర భారతభూమి చూపడెనొ లేదొ
విషము గుప్పించినాడు, నొప్పించినాడు
మా నిజాంరాజు జన్మజన్మాల బూజు.

భారత మాతృగర్భమున
　　బల్లెము గ్రుచ్చిన దుండగీంద్ర కా
ధారముగా నిజాం నృపతి
　　తాళము తీసిన పెద్దపెద్ద బం

గారవు బొక్కసాలు పసి
    గట్టెను తెల్లదళారి; అంతలో
బేరముసాగె పోరు జరి
    పింప తుపాకులు దింపు కోర్కెమై.

కోటి తెలుంగు లొక్కమొగి
    'కో' యని పిల్చిన యంతలోనె ఆ
రాటముజెంది భారత
    ధరాతలమంతయు పొంగి వచ్చెడో,
'కూటికిలేని పేదలకు
    గూడను పౌరుషమా !' యటంచు స్త్రీ
కోటిని మానభంగములకున్
    గురిచేసిరి ముష్కరాధముల్.

చల్లని మంచుకొండలు
    భుజమ్మున మోసెడు భారతమ్ము శాం
తిల్లె నిజాము నీల్గుడులు
    తేటపడంగలదాక; అంతలో

భౌష్మ కుండ బ్రద్దలయి
    పోయెను, భారతమాతృ దేవతా
పల్లవహస్త యుగ్మకము
    పాసెను భీషణ లోహశృంఖలల్.

దూరాన నున్న * 'పట్టము'
దూరానసె నిల్చె; † తెల్లదొంగ సభస్యం
పారియయి పోరె; స్వేచ్ఛా
భారత సైన్యంబు తలుపు బ్రద్దలు కొట్టెన్.

ఎదురెక్కియున్న జలములు
పదులై పారవారె యింటిపడుమన్; రాముం
డదనున బాణము పడెను
మదపడగెను మా నిజాము మారీచునకున్.

రెండు వందలయేండ్ల చరిత్ర గదుల
కప్పుకొనియున్న గాఢాంధకార మెల్ల
కొట్టుకొనిపోయె తూరుపు మిట్టనుండి
పారివచ్చిన వెలుతురు వాగులోన.

*నవంబరు 1948*

* పాకిస్తాన్    † హాటన్

# తెలంగాణ తల్లి

ప్రాణము లొడ్డి ఘోర గహ
　　నాటవులన్ పడగొట్టి మంచి మా
గాణములన్ సృజించ నెముకల్
　　నుసిచేసి పొలాలు దున్ని, బో
షాణములన్ నవాబునకు
　　స్వర్ణము నింపిన రైతుదే తెలం
గాణము రైతుదే; ముసలి
　　నక్కకు రాచరికంబు దక్కునే ?

నీ యొడిలోన పెంచితివి
　　నిండుగ కోటి తెలుంగు బిడ్డలన్;
ప్రాయము వచ్చినంతనె
　　కృపాణము లిచ్చితి, పోరు సల్పి వా

ప్రేయ భుజాబలంబు పరి
సింహ జగంబు నవాబులో నవాబ్
చేయు మనంటి, నీ తెలుగు
తేగడిలో జిగి పెంపు, తల్లిరో!

మహమద్ రాక్షస రక్త పంక్తికంబో
మా భూమి లంఘించి మా
మహవర్ నాక్కాడి మేం గూడ నెటు
బిక్కున్ దోప దుష్కృత్యమున్,
బ్రతుకే దుర్భరమైన యిప్పుడును
ఆంధ్రత్వమ్ము పోనాడకే
మ, మదిన్ గెల్చితిమమ్మ యుద్ధమున
రుద్రుల్ మెచ్చ నాంధ్రాంబికా!

పాటలు పాడితిన్ తెలుగు
బాటలు నిష్ఠుర మేలుకోగ, పో
రాటము చేయగా, కరకు
రాచరికమ్మును కూలద్రోయగా,

కోటి గళాల నొక్కకడ
గార్చితి విప్లవ శంఖ మొత్తితిన్;
నాటికి నేటికిన్ తెలుగు
నాటను కాంతి పతాక రెత్తితిన్.

తుంగభద్రా నదీ భంగమ్ము లిరుక్రేవ
లారసి పాడుచు రుచు లరయుచుండ,
కృష్ణవేణీ తరంగిణి నాలుకలు సాచి
దరుల రెండిట 'మజా' లరయుచుండ,
గోదావరీ వీచికా దివ్య హస్తమ్ము
లిరు కెలంకుల దరు లొరయుచుండ,
కోటి కిన్నెరసాని మాటిమాటికి పొంగి
రెండు క్రేవల దరు లండ గొనగ,

ఇటునటును తెల్గునేల లారటము జెంది
కలసిపో జూచుచున్న యట్టులనె తోచు;
కలిపివేయుము నా తెలంగాణతల్లి!
మూడు కోటుల నొక్కటే ముడి బిగించి.

*జనవరి 1949*

# పౌషలక్ష్మి

బద్ధ కవాట గవాక్ష గేహమ్ములు
　　　వెడలిరా వెరచెడి పిన్నపెద్ద
లంగారధాని కోత్సంగ సంగతి వహ్ని
　　　కాలదో యనునట్లు కేలు సాచి
ఉష్ణపానీయ మహూర్మహూ రాసేవ
　　　నమున లోమేను కోష్ణ మొనరించి
తీవ్ర శీతానిలోదిత బాధ శమియింప
　　　నవ మష్టికాసవము త్రావి

అప్పటికి గూడ తగు వేడి నందలేమి
తత నఖంపచ వక్షోజ తరుణమైన
కామినీ దేహవల్లికై కాంక్ష రేపు
పౌషమాసము శృంగార పోషకమ్ము.

పౌషము వనితా సుమనో
మోషము, శృంగార రస విముగ్ధ జగత్సం
తోషము, నగ్నాయిత తరు
శేషము, శిశిరానిలోపచిత వేషంబున్.

పచ్చ చేమంతులు తెచ్చె జాణ యొకర్తు
ఏలపేటిక నిండ నింపుకొనగ,
బంతిపూవులు తెచ్చె నింతి యొక్కతె తన
ప్రియునికి మెడదండ వేయుకొఱకు,
బొండుమల్లెలు తెచ్చి పండువెన్నెలవోలె
ఇల్లెల్ల చల్లిపోయినదొకర్తు,
శ్రీకాంచనమ్మల చిన్నారి యొక్కతె
యొడినిండ నింపి దుందుడుకు సేసె,

కుసుమగంధి యయ్యె కుసుమాంగి యయ్యెను
కుసుమహార యయ్యె కుసుమనేత్ర,
కుసుమబాణు శాతకుసుమాస్త్రములు తాకి
కుసుమచాప వహ్ని కోరగింప.

ఆలుమగల కలత లంతరించెను నేడు
ప్రియుడు ప్రేయసిని మరింత వెదకె,
జంటసుంట గాక ఒంటిగా నుండుట
కంటకమ్మె యయ్యె నింటియందు.

పాలపాయసం రేగుపండ్ల స్నానా లాడి
క్రొంబట్టు పుట్టమ్ము కూర్చి కట్టి,
నువ్వుల బెల్లంబునున్ మెక్కి పచ్చని
జామ పండులను ముచ్చటగ నమలి,
క్రొత్త బియ్యపు కూడు గుడిచి త్రేన్పులు తీసి
పచ్చదోసల మునిపంట గొరికి,
వడియాలు కరకర చప్పుళ్లు సేయగా
దవడలాడించి రేబవళులందు,

ముంగిళల రంగవల్లికల్ మురిసిపోవ
ఘుమఘుమ ఘుమాయమానమై భోగిమంట
అన్నిదిక్కుల వెలుగొంది అందగింప
వచ్చె సంక్రాంతి, మానవావళికి శాంతి.

నిరుడ యీ రోజుల చిరుతప్రాయపు బేల
కంతలో సిగ్గు పయ్యంటవేయ,
పరియాచకము లాడ వచ్చిన చిన్నారి
మరదలి యెద కొంత బరువు నింప,

పసయింటి చిన్నది నినమొన్ననే వచ్చి
అప్పుడే నర్మ హాస్యమ్ము లాడ,
పొరుగింటినుండి సుందరి యొర్తు తనవైపు
మాటి మాటికి మేనుమరచి చూడ,

మనసులో నేదొ క్రొత్త సంబరము దోప
తనువునన్ నూతనోత్సాహ మినుమడింప
యువకు డానందవార్ధి పెల్లుబ్బిపోవ
పౌషమాసాన సంక్రాంతిపడుచు వచ్చె.

పల్లియుల్ బహుధా వినోదకలనా
ప్రస్ఫీత చేతస్కులై
యుల్లాసమ్మున పిన్న పెద్ద లొకడై
యుబ్బొంగి సంక్రాంతి నా
హుల్లంఠించిరి శైశిరానిలుని,
వాతోద్ధూత కీలావళీ
పుల్లాగ్నిచ్ఛట భోగిమంటలుగ
మాపున్ రేపు సాయమ్ముగాన్.

# మధు రథము

చిరుచేదు వేపపూవుల
పరిమళముల దారులందు పరువిడి వచ్చెన్
ఖరకర తీక్ష్ణాతపములు
కొరకొరలాడన్ మధుండు, కుసుమరథుండై.

మధు రథమార్గమందు సుషమా
సుకుమార రసార్ద్రి మల్లికా
గ్రథన మొనర్చగా వెలుగులంబడి
వచ్చిరి సుంద రాప్సరో

మిథునము; లామనిన్ దొరయు
        మృత్తికసైతము దివ్య సౌరభ
ప్రథితము కాదొడంగె సుర
        పాదపమ్ములు సోకినంతనే.

విచ్చిన మోదుగంబు పుల
        వెచ్చని చూపులలో వసించు కా
ర్చిచ్చులు రెచ్చిపోయి విరచించిన
        యెఱ్ఱని నాట్యశాలలో
అచ్చర లాడినారలు, నవాబ్ద
        మధూదయ రాజ్యలక్ష్మికిన్
ముచ్చటగా, సముచ్ఛ్వసిత
        మోహన యౌవన భాగధేయలై.

శీతవాతంపు క్రకచంబుచేత గోత
వడిన గుండెల నతికించ వచ్చినాడు
మధు రథమ్మున మాధవ మౌనివరుడు
కుసుమ సంజాత మధురస గుళికతోడ.

కంటకాయిత శైశిర మంటపమున
వజవజ వడంకి కన్నీరువార నేడ్చి
ఒంటరితనాన గడచెడి కుంటి బ్రతుకు
నేడు సుంత నవ్వులవారి నిక్కిచూచె.

మాధవస్వామి చైత్ర రథాధిరూఢు
డై, ధనుర్ధారి యైన పుష్పాయుధునకు
శాణ కర్కరోల్లీఢ నిశాత శరము
లిచ్చి పోవగ వేవేగ వచ్చినాడు.

ఆకురాలి దిగంబరమైన నాడు
శుష్కజీవన భూజమ్ము చుట్టుకొనగ
పూల పుట్టమ్ము లొసగిన పుణ్యమూర్తి
మాధవుడు, వనరాజ్య రమాధవుండు.

తూణీరమ్మున పూలబాణములు
చిందుల్ ద్రొక్క, నక్రధ్వజ
స్థూణా శృంగపటంబు కంపిల, జయ
స్తోత్రమ్ములన్ షట్పదీ

వేణుల్ పాడ, సుమాయుధుండు కుసుమ
ప్రేంఖ ప్రసాలాగ ని
శ్రేణీ రోహకు డౌచు జేరె
గమికర్ప్రఖ్యాత వాసంతమున్.

చిరిగిన కోరికల్ మరల
శృంగము లెత్త, నిరాశ పోయి శై
శిర మరుదంకురమ్ములు
నశింప, వియోగ విషాద వేదనా
భరములు సన్నగిల్లి గత
వర్షముతో జతగూడ, కేతకీ
సురుచిర పత్రికా కనక
శోభలతో మధుడేగుదెంచెడిన్

ఏదైననేమి : క్రొత్తది
రాదలచినయపుడు గుండెలన్ పూదండల్
గా దొడిగి సమర్పించుట
కాదే సుమనస్కులైన ఘనులకు ప్రియమౌ.

# మాధురి

ఇంటి కొక్క వేప ఇవురు పెట్టిన దేల !
శిశిర వాత ఘాత జీర్ణమైన
నగ్న తనువులందు అగ్నిచేలమ్ములు
కట్టుకొనె పలాశగణ మదేల !

మంచుతో నరాలు కుంచించుకొనుచుండ
వేడి నెత్రు పరుగుపెట్ట నేల !
తరతరాల పాత బరువులు పడద్రోసి
మెడలు పైకి సాచి నడచు టేల !

బండవోని మంచు పర్వత శిఖరాల
నుండి డిగ్గిరాక మొండికెత్త
చైత్ర చిత్రభాను సాధు హస్తమ్ములు
కొండ క్రిందిదాక గుంజ నేల !

మంచు కరగినట్లు మనసులు ద్రవియించి
ప్రేమ జలలుగా స్రవింప నేల !
పడతి చూపులోన బాణాలు పదునొత్తి
మరుడు మనల గాయపరచు టేల !

అరుణకుసుమ జాలాలపై పరాగప్రభ
తరుగణమ్ము లీనుపరచు వేళ !
హిమ భరమ్ము పలుచ చెమరింప జాలని
గుండెలం దుగాది పండ నేల !

పండిన ఈ ఉగాది
    పువుమంటలు వేపలకుండీ మల్లికా
మంచపి దాక ప్రాకినవి;
    పంటలు పేరిన గుండెలంచు కా
ర్చుండిన స్తబ్ధరాభరము
    పొక్కుచు సోలుచు పారిపోవ నై
దండలు నెత్తివచ్చిన
    దుదార మధూదయ లక్ష్మి ఆమనిన్.

ఎన్ని శిశిరఋతువు లెన్ని హేమంతాలు
నా మనోవనాన నాట్యమాడి
పుష్పశిల్ప మెల్ల పోద్రోలి శాఖాళి
విరిచి బ్రతుకు నగ్నపరుపలేదు !

ఎన్నిమారు లిటు లేను కంపింపలే
దెన్ని మార్లు మ్రోడు రెత్తలేదు!
శిశిర శీతవాత శీర్య దాశాలత
ఎన్ని సార్లు వేరు తన్నలేదు!

పూవులు రాలిపోవ,
    పసిమొగ్గలు నాకులు తూలిపోవ ల
జ్జా వలమాన శాఖలను
    సాచుచు మాధవమూర్తి కోసమై
త్రోవలు చూచు దాసన
    వధూమణి ద్రౌపదికన్న వేయిరె
ట్లావడి నంది యుండె
    శిశిరాహతి దిగ్వసనాధివాసయై.

నేను వలపంత యేతెంచి కీడు నేయ
రేపు రాకుండునే హాసరేఖ యొకడు!
ఆకు రాల్చెడి కారు నే దరుగుదేర
వెనుకపడి యుండనోపునే విరులకారు?

ఒంటరివాడనై బ్రదుకు
      నూరక కుంటిపదాల గెంటితిన్
కంటకి తాధ్వమందు;
      పువుకారుల బాటలు కానరాని నా
కంటికి ఇంద్రజాల మటు
      కన్పడి నందనమై ఉగాది గో
రంటల చాటునుండి ఒక
      యవ్వని నవ్విన యట్లు వచ్చెడిన్.

గుమగుమలాడి వాసనను
      గొన్న సపాట్ల సఖీ ముఖానురా
గమున సుమించె చంపకము;
      కౌగిలిలో ప్రసవించె గోరటల్;
సుమరమణీయమై తగె
      నశోకము తచ్చరణాహతిన్; ప్రహా
సమున సుమించె పొన్నలు
      పసందగు నందన దివ్యవాటిలో.

కాసగ అందరాని జిగి
        వైతల ఏయుడనాల లోతు ల
స్త్రై నసలూని యవ్వనపు
        టగ్గిని పుత్కిటి బిట్టి కాంచనా
థ్యాణ విరాజమాన కటిస్త్రై
        అరుదెంచిన మా నపాట్ల ల
క్ష్మీ నవహాసముల్ బ్రతుకు
        మేడను పువ్వుల దివ్వె తెత్తెడిజా.

మాడిపోయిన మావి మోడుపై ఇవురించె
        అరుణ ప్రవాళ సుందర సరమ్ము,
వేడుగారెడి వేపచెట్టు కొమ్మలపైన
        ముత్యాల మ్రుగ్గులు మురిసిపోయె,
బెత్తాలవలె సాగి బెత్తిక తెత్తిన
        మల్లెలు వజ్రాల ముల్లెలయ్యె,
పాదులోరాలిన పండుటాకుల నేడ్చు
        గేదంగి బంగారుగా చెయయ్యె,

పొగడఁగారాని పొగడలు పొగడబడియె,
వెన్నెలలు కాచె మొల్ల తీవియలమీఁద,
వింతమందారములు ప్రసవించి మించె,
నందనంబై నవాబ్ది సౌందర్య మడరె.

పూవుల శరాలచే తెగిపోయి సట్టి
శిశిర రాక్షసీ భీకర శిరము లట్లు
అచ్చటచ్చట నల్లగా అద్రి శిలలు
కానుపించెను కుసుమిత కాననమున.

చలి యనగ లేదు, మంచుల జాడ లేదు
తలపులను మూసికొనియెడు తలపు లేదు
వెచ్చదనము నరాలలో పిచ్చలింప
కోష్ణ రుధిరమ్ము గుండెలో కుస్తరింప.

పూల వెచ్చదనము పాలిండ్ల పెప్పంచ
నమ్ము కలసి చూప ఇమ్ముడింప
మదనదాహ తప్తమై ఊర్పులును కూడ
పూవుబోండ్లు క్రాగి పోయినారు.

# రాగబంధము

పూల గాలి సోకి పులకింప జగ మెల్ల
వచ్చినది ఉగాది వన్నెలాడి;
ఆకు రాలి గొంతు లారిన తరువుల
పూవు పూవు నాల్క పోల్కి పల్కె.

కొత్తదనాలు పూవులయి
గుత్తులుగట్టి ఉగాది పందిటన్
మత్తిలి నృత్తమాడినవి;
మామిడి కొమ్మలు కొత్తగా చివు
ళ్ళెత్తి, సుమించి, కాచి,
ఫలియించెను, తీయని క్రొత్త కోరికల్
మెత్తని మన్మనఃపథముమీద
పదమ్ముల నూని సాగినన్.

మ్రోడులు గొంతుమున్న
విడిపోవగ శాంత వసంత భాష మా
ట్లాడి ప్రవాళ హాసమున
నందరకున్ గిలిగింత పెట్టుచున్

పొడవొసంగె క్రొవ్వెలుగు
 పాటలు, మంద సమీర జాల జీ
రాడెపు చీరెతో తెలుగు
 టంగణ రంగమునన్ నటింపగన్.

ఇది జనతాయుగంబని
 గ్రహించుట యెంత సమంజసమ్మొ నే
నిది కవితాజగం బని
 వచించుట యంత సమంజసమ్మొ: ఉ
న్మద గజయానయై తెలుగు
 టంగన వేషప్రసాద మిచ్చుచు
న్నది గ్రహియింపు మామని
 పునాదులు గట్టిపడంగ ప్రేమతో.

కవిత లేకయున్న యువత శూన్యం బౌను,
యువత లేకయున్న నవత సున్న,
నవత లేకయున్న నాగరకత లేదు,
నాగరకత లేక నాడు లేదు.

నాలో కోటి పదాలు పల్కి రస వీణా
తంత్రికా వీథిలో
జాతై భ్రమ్మి నవ ప్రపంచ జనతా
సంగీత సంభావనా
లీలా లోలములై విపర్యక పతిన్
ఢీకొంచు గంగానదీ
నీలాంభస్స్పృశాతివేగత
ప్రవహించున్ కవిత్వమ్ము తాన్.

మతము లబద్ధముల్, కులము
మాటలు పట్టివి, లేమి కల్మి సం
గతియును కృత్రిమం;
జనని కర్త్రిని పుత్త్రకు నుత్తరించి గె
ల్చితి నను మాట బూటకము,
లేదని యుంటని వింత నామముల్
వెతకుట వట్టి నాటకము లెమ్మి;
నిజమ్మొక రాగబంధమే.

తావులు పుక్కిలించెడి
　　ఉదార లతాంత లసద్వసంత ల
క్ష్మీ వసనాయతాక్షి
　　వికసించిన వెన్నెల రాత్రివోలె నా
త్రోవల పాలువోసినది,
　　తొంగలిరెప్పల జారు సిగ్గ ని
గ్గై వికసింపగా జిలుగు
　　లద్దిన బుగ్గల మొగ్గలందునన్.

నెమ్మెలమీది దీపములు
　　చిక్కిన తళ్కుల పొల్కి ద్వారబం
ధమ్మున వేపపూవెలది
　　నవ్వులు రాల్చినయంత రాగబం
ధమ్ములు నిచ్చె నా మనసు
　　దారుల తోరణాలై; ఉగాదిలో
కమ్మది; కమ్మవిల్తుని
　　జగ మ్మిదిసుమ్మిది నమ్మి రమ్మికన్.

కెమ్మురమ్ములుగా పువ్వుంబువు వెలింగెన్,
కోటి మామిళ్ళ గి
ల్వమ్ముల్ పాడె; ఉగాది సౌరభముతో
ధాత్రీ సురాపాత్ర పై
త్రమ్ముల్ నింపిరి వెంపు శ్రోత్రజనులారా !
ద్రావుడీ అక్ర ప
ట్మైమ్మై యొప్ప బిరమ్మునన్ విజయ
గర్వ ప్రౌఢిమాఖ్యమ్మై.

నాలో లక్ష ఉగాదిపండుగలు
దండల్ దండలై యుండగా
ఏలా మంచివి చెడ్డ వంచు విడదీయింపగా !
చరిత్రాంగనా
నీలాలోల శిరోజరాజి కివి
వన్నెల్ గూర్చి నా కావ్య ల
క్ష్మీ లాలిత్యము సూపుబో నవయువ
శ్రీమంతముల్, శాంతముల్.

సుమసమిద్ధమైన ఈ ధరణి
మూర్ఛలు నా చెవి బడ్డయప్పుడే
ప్రిదిలె రస ప్రపంచములు;
వీచె మహా శిశిరానిలమ్ము; భూ
వదనము వెల్లబారి దిగ
జారెను, పూవులు తావు లేవి ?
అభ్యుదయము లేవి ? అట్టితరి
వచ్చె ఉగాది వసంతరాగముల్.

ఇంతకు మించి కావలయు
నేమిటి ? లోకము యౌవనానిలా
త్యంత వికస్వర ప్రసవ
దామ పరీమళ ధామమయ్యె; ర
వ్వంత కుసుంభ రాగముల
నంటని ఈ అనురాగబంధ మా
సాంతము నిల్చుగాత హ్లాద
యమ్ముల ఆంధ్ర మహాప్రజాళికిన్,

# మూర్ఛన

దొంతరలైన మబ్బులకు
త్రోవలు సూపెడి మించు కాగడా
చెంత మనోజ్ఞ కావ్యము
రచించు కవీశ్వరు నను జూచి భావనా
సంతతి నాగసర్పముల
చాప్పున వచ్చి నటించుచుండ వా
యింతును రుద్రవీణ,
నటియింతును పశ్చిమ దిక్తటమ్ములన్.

కుంతలముల్ కపోలములకున్
దగులన్ నయనాంచలమ్ములన్
దొంతర్లై నవాశ్రువులు
దొన్కు ప్రతీక్షణలో నిశాదివం
బెంతయు వంత చేత
కృశియించెడు ప్రేయసిగూర్చి నేను ప
ల్కింతును రుద్రవీణపయి
కేవల సాంత్వన గేయమాలికల్.

చింతల తోపులో కురియు
చిన్కులకున్ తడిముద్దయైన బా
లెంతయొడిన్ శయించు
పసిరెక్కల మొగ్గనువోని బిడ్డకున్
బొంతలు లేవు కప్పుటకు,
బొంది హిమంబయిపోవునేమొ ? సా
గింతును రుద్రవీణపయి
నించుక వెచ్చని అగ్నిగీతముల్.

గొంతుక ఎండి డొక్కలకు
కొంచెము గంజియు లేకపోయినన్
పంతము నెగ్గగావలెను;
ప్రాణము పోయెడుదాక సమ్మెగా
వింతమటంచు నాకట
తపించెడి పేదలగూర్చి నేను మ్రో
గింతును రుద్రవీణ;
పలికింతును విప్లవ గీతికావళుల్.

# కపోతీ సందేశము

వెన్నెలరెక్క లెత్తి ఉడు
        వీధి ప్రయాణముసేసి వచ్చి కూ
ర్చున్నవి పావురమ్మః
        లెటనుండి బయల్వడెనో యెరుంగరా
కున్నది గాని, కాదగు-
        రణోల్బణ శామన కామసాత్త్వ హై
మోన్నత పర్వతాగ్ర శిఖ
        రోదిత కాంతి కపోత పోతముల్.

ఈ రణదాహ మేచెడి
మహీవలయమ్మునఁ గాంతి గోరి నీ
హార గిరీంద్రుఁ దక్షిణ
కరాగ్రమునన్ నటియించునట్టి క
ర్పూర పతాక మట్టులు
కపోతగణమ్ము పతత్రరాజి వి
స్ఫారగ వచ్చి నా గృహము
వాకిట వ్రాలెను హుంకరించుచున్.

తెల్లని పావురాళ్ళ సభ
దీరిచి కూర్చొనియుండ శారదో
త్ఫుల్ల సితాభ్ర ఖండములు
దొంతరలై ఒకదానిపై నొకం
డల్లికగొన్నయట్లు, హరి
ణాంకుని తెల్లని మల్లు కండువా
చల్లని గాలిలో నెగురు
చాడ్పున కానబడెన్ వసంతుగా.

నీహారాద్రి శిఖా సమంచిత హిమానీ
దివ్య ధావళ్యమున్
దేహం బంతట సంతరించిన కపోతీ
తల్లజం బొందు సం
దేహం బించుక లేక మిత్రమువలెన్
దీపించుచున్ వచ్చి నా
బాహాగ్రమ్మున కూరుచున్నయది
నాపై ప్రేమభావమ్మునన్.

లంగ్వైచి వచ్చి చెంగనాలను కొట్టి
రవళిసేసి బొమ్మరమ్ము లాడి
రెక్క తుదలలోని లేత ఈకలతోడ
నా కపోలములను తాకితాకి,

ఎంతో ఆప్యాయనమున
గంతులిడును, బుజము విడదు; కలహమ్ములతో
చింతలతో చిక్కులతో
వంతగొనిన నాకు శాంతి వరదాన మిడున్.

* * *

"ఎందుకు వచ్చినావు ? పడగీ !
రణదాహముతో జపించు మా
యందలి ప్రేముడిన్ శమ
దమాది గుణమ్ములు భిక్షపెట్టి నీ
ఇందుసమాన దేహమున
నీరికలెత్తిన కాంతి చంద్రికల్
చెంపములందు చల్లి మర
లింతువె మమ్ము సుధాపథాలకున్ !

నేను దానవుడను; రమణీయ వస్తు
జాలమును చూడలేను; దౌష్ట్యమ్ము పెంచి
నలిపివేతును మానవావళిని సొంత;
మవుదుగాని నా ఆకలి యారిపోదు.

ఒకరి నొకరము ద్వేషించి ఒకరిగళము
నొకరు నొక్కి కవోష్ణాస్ర మోడ్చి త్రావి,
తోటివానిని చంపి సంతోషపడెడు
మాకు గిట్టునె శాంతి సోమరసధార !

వినలేదే మొనమొన్ననే జగతి
కంపింపంగ సంభ్రమ్ములం
దున వైజ్ఞానికు లిచ్చినట్టి
పరమాణు ప్లావనోదంతముల్ ?
ధన మెంతైన వ్యయించి ఈ జగతి
సంతన్ బూదిగావించు వి
ద్యను నా రాక్షసవాంఛ తీరుటకు
నభ్యాసించితిన్ పక్షిణీ !

కానీ నిన్ దరిసించినప్పుడు
మనఃకండూతి చల్లారి ఏ
దో నైర్మల్యము వచ్చిచేరినటుగా
తోచున్; దురాశా నిరా
శా నైష్ఫల్యము లారిపోయి ఒక
స్వచ్ఛ స్వర్ణమార్గమ్ము లో
కానన్ కన్నుల గట్టినట్లగును
దుఃఖ క్లిన్న జీవాలకున్.

నాకు శాంతిబోధనము చేయుటకుగాను
పక్షివయ్యు భీతుపడక వచ్చి
బుద్ధిగరపినావు పులుగుబాలా ! నీవు
శాంతిదూతివై అశాంత ధరణి.

కాస్త పశ్చిమాద్రి కడ కేగి నా బంధు
జాలమునకుగూడ శాంతి నేర్పి
ఇలను కాచుమోయి ఈ అణుప్రోద్గత
ప్రళయ వహ్నినుండి, పక్షిరాజ్ఞి !"

దానవాంశతోడ ధరణి కేతెంచిన
నాకు రాగబంధనమ్ము కూర్చి
పులుగు సుపతి చంచు పుటము నాడించుచు
ఎదను బారసాచి ఇట్టు లనియె:

"ముక్కున శాంతి బీజములు
మోయుచు బోయి విశాలభూమి నల్
దిక్కుల చల్లి వచ్చితిమి
లెమ్మ, భయంపడబోకు; మప్పుడే

మొక్కలు లేచుచున్న, విక
ముందట కొమ్మలు సాచి పెద్దవై
చక్కని పూలు పూచి ఫల
సంతతితో పరిపుష్ట మయ్యెడిన్.

శాంతిశ్రీ సుషమాభిషిక్త ధరణీ
చక్రం బలుప్లావనో
దంతోద్భ్రాంత నరావళీ హృదయ
సంతాపంబులన్ వాపి నే
మంతీ మంగళ దామమంజుళలుగా
మత్తైభయానల్ పికీ
సంతానమ్ములవోలె పాడి శుభ
మాశాసింతు రెల్లప్పుడున్.

ఇక యుద్ధభయం బుండదు;
వికసించును శాంతి సుమము; విజ్ఞాన ధనం
బిక సార్వభౌమమై తగు.
నొకనాటికిగూడ యుద్ధ మొదవదు జగతిన్.

నా ఈ కృషికిన్ సాయము
సేయపడెను నీవు; శాంతి చింతాపరయై
వ్రాయబడు నీ కవిత్వము
మోయుచు కొంపోదు మూలమూలల నెపుడే."

అని పారావతరాక్షి పల్కుటయు
నీహారాద్రి కూటాగ్రమం
దున రత్నాల హారంగ దివ్వియలు
చిందుల్ ద్రొక్కినట్లై, మన
స్సున నా భారతమాత సాంత్వన
వచస్సుల్ పల్కినట్లై, జగం
బున శాంతిప్రభ వెల్లి విచ్చినటులై
పోవంగ నుప్పొంగితిన్.

* * *

గగనభాగమునకు ఎగబ్రాకి తన తోడి
వానితో కపోతి పయనమయ్యె;
శాంతి దౌత్యమునకు చను పక్షులు సహస్ర
పూర్ణ చంద్రబింబములుగ తోచె.

## మంజీర★

ఎవరి గజ్జెల రవళివే నీవు మంజీర !
ఎవరి కజ్జల బాష్పధారవే ! మంజీర !

నీవు పారిన దారిలో ఇక్షుదండాలు
నీవు జారిన జాడలో అమృతభాండాలు

★ నిజాంసాగర్ ప్రాజెక్టు ఈ నదిపై నిర్మింపబడినది.

నీవు దూకిన నేల మాకు విద్యున్మాల
నీవు ప్రాకిన పథము మాకు చైత్రరథమ్ము
ఎవరికొరకయి పరుగులెత్తి వచ్చితివి ?
ఎవరి జూచి తటాకమై నిల్చిపోతివి ?

జీరలువడ్డ నా గళము
చేరి నవధ్వని ఊటలూర్చు మం
జీరవు నీవు; నీ వెలుగు
చిందెడి చక్కని దేహవల్లి కే
చీరలు కాన్క తేగలను
చెప్పుము తెల్గునదీ ! తెలుంగు బం
గారపు రంగు లద్దిన
నిగారపు కావ్యదుకూలముల్ వినా ?

నీ నీలాల జలాల శయ్యపయినన్
నిద్రించు నాకాళ మం
భో నిర్ణిద్ర పయోద గర్జనలతో,
ప్రోద్యన్మహావిద్యు

దుష్కాలనీకమ్ములతో సదా సలిల
        ధారా రమ్య వర్షాఋతు
స్థానంబై కృషిక ప్రజావళి
        బుభుక్షాశాంతి గావించుచున్.

ఆకలి తీర్చుకన్న ఘన
        మైన మహోయజనమ్ము కాన మీ
లోకమునందు; ఏ మనసులో
        నొకనాడు తదీప్సితమ్ము చీ
కాకౌనరింప వాకపయి,
        కాలువవై, ఝురివై, తటాకమై
మాకార మేగుదెంచితిసుమా !
        కమనీయ పయోధరమ్మునన్.

శిలగా నే గిరిసీమ డాగితివో
        మంజీరా ! శతాబ్దాలు ని
శ్చలవృత్తిన్ పలుకేని లేక నొక
        వృక్షచ్ఛాయ దుష్టాత్మ గుం

డెలలో ద్వేషము వోలె ఇంచుకయినన్
హృద్యమ్ముగా; కిప్డు క
న్నుల నీరై ఇటు జారినావు దయ
తోనో ప్రేమభావాననో!

నిను కరగించి తెచ్చిన పునీతు
డెవం? డతనిన్ భగీరథుం
డనవలె; వాడు నా తెలుగు
టంగణమందలి ముండ్లదుబ్బులన్
తునియలు కొట్టి ఈ చెరకు
తోటల గూర్చి హాలమ్ము గ్రుమ్మి, భూ
మిని ప్రసవింపజేసి పసిమిన్
మిసిమిన్ పెకలించె దండిగా.

ఆతడు నేలదున్ని బ్రతు
కంతయు పస్తులు పన్న రైతు మా
పోతన యేమొ! వాని వడ
పోతలలో కవితాప్రపంచ మా

పాతమనోహరమ్మయిన
పల్కు జగద్విదితమ్ము; దాని సం
గాతము నీవు కావ్యతను
కల్పన చేసినదోయి, వాహినీ!

ఒకట నడిపయి, ఒకచోట ఒదిగి ఒదిగి
* సాగరమ్మై చలింపక దాగియుంటి;
వెంత సౌమ్యస్వభావమోయీ! పరుంగు
లిడు మనస్సును బంధింప దొడగినావు.

ఇందూరుమండలం బెందాక నీనీటి
తడి తాకి తీయని తనమునొందు,
నా తెలంగాణమ్మ గీతనృత్తములతో
నెందాక నిన్ను పూజించుచుండు,
నెందాక నిరుపేద లంది నీ జలధార
పండించుకొల్లగా పైరుపంట,
ఏ కవీశులు నీ మహాకావ్యత నెరింగి
తమ కలమ్ములకు సౌందర్య మిడుదు,

* నిజాంసాగర్

రంతదాక మహీమండలాంతరమున
నీ వెలుంగుకు రవ్వంత నీడ రాదు,
దివ్య గోదావరీ గృహాంతికమునందు
నీ విలాస మేనాటికి నిలిచిపోదు.

రుద్రవీణ తీవమ్రాద్రి ఝుంఝుమ్మని
తరగ లెత్తి వచ్చుదాన వీవు;
నా మనస్సులోన నాదాలు కల్పించి
స్పందనమ్ము నేర్ప జాలినావు.

నా తెలుగువీణ బోయిన మూర్ఛనలు నేడు
నీవుగా పారి నిండినవి నా భూమిలో;
ఇక ఎన్ని చెరకుతోటలు పండ వీచోట!
ఎన్ని చక్కెరమిల్లు లివురింపవు!

ఎవ్వరే యెదురొచ్చి ఏడుపాయలు చేసి
రవ్వల్ల వీణపై రాగమొత్తిరి నిన్ను?
*ఏడుపాయల దుర్గ యేమన్నదే నిన్ను?
యేమన్నదే నిన్ను యేడుపాయల దుర్గ!

* ఒక ప్రదేశము

(మంజీరా మౌనభంగం)

ఏడుపాయల దుర్గ ఎదురుగా వచ్చింది
పాడుకొమ్మన్నాది పరుగులిడమన్నాది
స్వర మొక్క పాయగా సాగిపొమ్మన్నాది
బంగారు పండించి ప్రజల కిమ్మన్నాది.

(మంజీరప విశ్రాంతి)

అదిగో హసంతికలు అదె సుమలలంతికలు
అదిగొ నేమంతికలు, అదిగొ వాసంతికలు
జయదాయకములు, సంశయ మాయకమ్ములు
ప్రియకరము లమృతపిచ్ఛిలము లుజ్జ్వలములు.

మిట్ట లెక్కియెక్కి గుట్టలు దిగజారి
త్రోవ గడచి వచ్చినావు నీవు,
మిగుల శ్రమలుగొన్న మిసిమింతురాలవు
సేదదీరు మీ ప్రసిద్ధ భూమి.

# క్షమామూర్తి

ఉదయాగంబుననుండి ప్రొద్దున దిశా
యూథంబులన్ రాగసం
పదతో నింపెడి బాల భాస్కరుని
శోభామూర్తి యందేమొ గాం
చి దయారూపము కాంతి పుంజమయి
సందీపించు దీప్తప్రజా
హృదయాంధ్యమ్మును బాపి శాంతి సుషమా
రేఖల్ పిసాళింపగన్.

మోకాలు దాటని ఫుల్ల మల్లీ కుసు
మాయమానంబు కొల్లాయి జుట్టి,
పచ్చని బంగారు వన్నె ఫాలంబున
బ్రహ్మ తేజో రాశి పదిలపరచి,

చేతిలో విజ్ఞాన సీమయై వెలుగొందు
గీతా ప్రబంధంబు కీలుకొలిపి,
పెదవుల రసనాం పేటిలో కదలాడు
అమృత హాసంబు కొంతవల చిలికె,

భారతీయత కాయువు పట్టువోలె
బుద్ధదేవుని పర్యాయ మూర్తి యగుచు
హిమగిరి శిఖాగ్రమే చేతు లెత్తి నడచి
నటుల తోచు గాంధీ మూర్తి నర్చసేతు.

అతడు బంగారంబునం దెట్టి విలువను
పరికించి యెఱుగని వైశ్య వరుడు,
కత్తితో శత్రువు కడతేర్చ గలమన్న
చాదస్త్రములు లేని క్షత్రియుండు,
బ్రహ్మ విజ్ఞానంబు పదిమందికే యను
వర్గీకరణ లేని బ్రాహ్మణుండు,
అణగారి పడియుండు టది నీతి యనుటను
కాలదన్నిన మేటి కార్మికుండు,

అంటరాని వారలమని అలమటించు
పంచముల హరిజనులని పాంచజన్య
మూది పలికిన హరిజనాభ్యుదయకారి
గాంధి దేవుండు మన లోకబాంధవుండు.

తెల్లవారల నిషా దింపి ప్రాచ్య ప్రజా
ధీ బలానకు వన్నె తెచ్చినాడు,
పాశ్చాత్య సంస్కృతి వ్యామోహమున బడ్డ
దేశీయులకు కండ్లు తెరచినాడు,
మరతుపాకీ గుండ్ల గురి తప్పిపోవగా
తకిలీని డాలుగా తాల్చినాడు,
తెల్ల వ్యాపారుల మిల్లు మూతలు బడ
ఖద్దరు గుడ్డలే కట్టినాడు,

ప్రొద్దు గ్రుంకని ఆంగ్లేయ భూములందు
తెల్లవారని అమవస దీర్ఘరాత్రి
నవతరింపించి నట్టి మహానుభావు,
డజునికేన్ బోలవచ్చునే అతనితోడ !

ఆడని వాడ్కారే అమృత
    పద్దిన చంద్రకళల్; నిరాశ యన్
గోతిని పడ్డ మానవులకున్
    వెలుగుంగయితోడు లిచ్చి సం
ప్రీతిని గూర్చి ధైర్యమును
    పెంచి మరెంత బలాఢ్యునైన ని
ర్భీతి నెదిర్చు శక్తినిడు-
    లేత పువుల్ ముల గెల్చునట్లుగాన్.

కేల్మోడ్తున్ బ్రతుకెల్ల త్యాగ హవనాగ్నిన్
    వ్రేల్చి ఆహారమే
పల్మార్వీడి మహోపవాసమున
    ప్రాక్పాశ్చాత్య లోకమ్ములన్
కేల్మోడ్పించిన తాపసేంద్రుని మనః
    కేదారమం దెంతగా
తాల్మిల్ పండినవేమొ శత్రువును సైరం
    బట్టై మన్నించుటన్.

పగవాని గౌగిలించెడి
తెగువ యతనివద్ద గాక దిగ్వపకమునం
దగపపింప దెవని వద్దను;
తగు సాతదె అసుర గుండె ద్రవియింపింపన్.

పాటా గొట్టి పురాణ వర్ణరచనా
వ్యాపార, మస్పృశ్యతా
ఘాటంబున్ సమతాగ్ని బూది యొనరింపఁ
జాలి, ఏనాటివో
జూటా మాటలు నేడు చెల్లవని విస్పం
గొంతుతో పల్కి మో
మోటం బించుక చూపనట్టి యమికిన్
ముప్పూట కేల్మోడ్చెదన్.

క్రీస్తై బుద్ధుడునై మహమ్మదయి
మూకీ భూత దీన ప్రజా
మస్తంబందు కరంబునుంచి అభయం
బందించి అజ్ఞానతా

గ్రస్తంబైన జగంబు జ్ఞానరుచితో
    లాలించి పాలోపరి
న్యస్తాంభోజ కరాల సవ్వడి పరంపంబున్
    స్తుతిన్ చేసెదన్.

క్రీస్తువలె ఆపదాంబుజ
మస్తము రక్తాన మునుగ మానవ హృదయాం
తస్థ క్రౌర్యపు వాడికే
అస్తంగతుడయ్యెః కృష్ణు డటు వ్యాధునిచే.

జనులారా! భరతాంబికా పద జతేజ
    ధ్వంసమున్ మానసం
బున ధ్యానింపుడు; గాంధి దైవతము
    సుభ్రూపాలనన్ తెల్లవా
ఏని భీతిల్లగ చేసిపట్టిదగు
    శాంతిశ్రీ మహాశక్తి భా
వసగావింపుడు; అహింస నేర్పుడు, బుత
    వ్యాసంగులై వెల్గడీ.

# కాపయ నాయకుడు *

ఎవ్వాడ వీవు: నీదు గళమే
ఒక భంగను కంచుగంటయై
రువ్వె భయంబు శాత్రవుల
రుగ్ణ మనంబులలో సతంబు; మా
బువ్వకు లేని పేదలకు
బొజ్జలు నింపినవాడ వీవు; ని
న్నెవ్విధి కాలదేవి మరపించెనురా
చరితార్థ జీవినిన్.

* *ఈతడు 1336-37 లో ఓరుగల్లును తుగలక్కునుండి ముక్తి పొందించెను.*

ఢిల్లి సులతాను కంఠపీఠిపయి నీవు
కరకుకత్తి ప్రతిష్ఠింప గలిగినావు;
కాకతీయుల నాటి విక్రమము మరల
చూపి తెలగాణ సామ్రాజ్యమ్ము చాపినావు.

చరిత యను గుడి చీకటి జాడలందు
కనక దీపంబవై తెలంగాణ భూమి
వెలిగి వెలిగించినావు విశ్వలోక కోటి;
కాపయా ! ఎట్లు మరతు నీ గాథ నేను ?

*　　*　　*

ఆంధ్ర సురత్రాణుడై ఢిల్లి సుల్తాను
వీపు చిట్లించిన వీరమూర్తి,
గ్రామీణులకు రాజ్యరథము పర్యార్తించు
శక్తి గూర్చిన ప్రజాస్వామ్యవాది,
వైవిధ్యమున గుండె పగిలిపోయిన జాతి
నేకీకరించిన ఇద్ధకీర్తి,
కాకతీయులతోడ గతి తప్పిపోయిన
ఓర్గల్లు గెల్చిన యోధవరుడు,

పడమ పురినుండి వంగాబ్ధివేలదాక
అల మహాంధ్రమ్ము పాలించినట్టి ఱేడు;
రాక్షసుని వంటి తుగలక్కు రాజు గుండె
గాయమై మండు కాపయ్యనాయకుండు.

రైతులే ఖడ్గధారా ధాళధళ్యమ్ము
తోప సేనానులై తోడురాగ,
పల్లెకాపులు చేత బల్లెముల్ త్రిప్పుచు
గుఱ్ఱాలపై ఆర్చికొనుచు సాగ,
కోదండపాణులై గొల్లలు, కోయలు
భటులుగా గ్రామాల బయల మూగ,
పట్టస కుంతాది బహ్వాయుధమ్ముల
పల్లిజనంబు కుప్పలుగ తేగ,

అల ప్రజాసేన నలుదిక్కు లావరింప
ఒక్క త్రుటిలోన తుగలక్కు డొక్క చించి
ఓరుగల్ కోటపైన బంగారు టెక్కె
మాటలాడించినాడు కాపయ్య నాడు.

మా తెలుఁగుల రోషానల
హేతిజ్వాలిక యందు, వీరాంధ్రధరా
ప్రీతుఁడు, దక్షిణభూముల
నాతారార్కంబు కీర్తి నార్జించె బిడా!

కాకతీయ కనక ఘంటా నినాదంబు
వినఁబడని మూక వేళలందు
వజ్ర శంఖమూది ప్రాక్పశ్చిమాంధ్రుల
మేలుకొల్పినట్టి మేటి యతఁడు.

* * *

భువనగిరి శాత్రవుల హస్తములను చిక్క
సుతు *వినాయకు నంపి గెల్చితివి దాని;
భువనగిరి రక్షసేయ నీ పుత్రుఁగూడ
బలియొసంగితి, మరల శత్రులను చిక్క.

తొణకని ధీరతా గుణముతో,
హాసిపోయిన త్యాగశక్తితో,
తెనుగు పొలమ్ము నైక్యముగ
దిద్దితి; వాంధ్రుల దాస్య బంధన

* కాపయ కుమారుడు వినాయకదేవుడు రెండవసారి భువనగిరిని ముక్తినొందించ పోరుసల్పి *1359* లో మడిసెను.

మ్మును నడపించి వారలను
　　ముక్తిని గూర్చితి వీవు; అట్టి వా
నిని కసితో శత్రువులతిహేయత
　　మోసము చేసి * చంపిరే!

† సింగమ సూనుడైన
　　అరిశేఖరు లీర్ష్య నురంగలింప నిన్
సంగరభూమి పట్టుకొని
　　చంపిరి; నీ దయనీయగాథ మా
ముంగిట ముండ్లతీవ యయి
　　ముట్టిన చప్పుడదెల్ల గ్రుచ్చు; నె
వ్వంగిని విస్మరింతును
　　భవచ్చరితార్ద్ర కథావిశేషముల్?

మీసమ్ముల్ మెలివెట్టి గుఱ్ఱముపయిన్
　　మేల్ రౌతుగా సాగి
ఉచ్ఛ్వాసాయాత త్రిలింగభూమి సురభి
　　వ్రాతంబు ప్రేరేపగా

* *1367-68* లో భీమవరము యుద్ధమున కాపయ మడిసెను.

† అనపోతనాయకుడు మొదలగువారు.

రోసానన్ తుగలక్కు సైన్యముల
నూరుంచేసి మాఱించియున్
దాసోహ మ్మనిపించినావు *సుర
త్రాణా ! ఆంధ్రరాష్ట్రేశ్వరా !

*　　　*　　　*

కాపయ పోయినాడు, తెల
గాణముతో సకలాంధ్రభూమియున్
చోపిడి సేయ బడ్డది
మనుష్యుల మెక్కెడి రాక్షసాళితో;
కాపెవడింక మా తెలుగు
గడ్డకు ? † ఓర్గలు పట్టణమ్ములో
ఊపిరిలే; దచేతనత
ఉగ్రపిశాచమువోలె నిక్కెడిన్.

ముక్కలైన మాతృమూర్తి దేహమ్మును
కూర్చి కట్టుదోయి కొమరులార !
మనము మనము కలహమున మునింగినయెడ
మన మహాంధ్రలక్ష్మి మనదు రాదు.

* ఆంధ్ర సురత్రాణ.

† పోలీసుచర్యకు ముందు ఓర్గలు నగరమున జరిగిన పట్టపగటి హత్యలు.

# సాహిత్య సామ్రాజ్యము

కలహోద్యోగము మానుకొమ్ము; కవితా
కంజాక్షితో రాత్రివే
ళల మేఘమ్ములు గాలి కౌగిళుల
నిద్రల్ వోవు నీలాల జా
డల సంచారము సేసి రమ్ము;
పరపీడా వృత్తితో బ్రుగ్గు భూ
ముల నేమున్నదిరా? నిరాశ్రయుల
ఊర్పుల్, కంట నీర్ గాడ్పులే.

అహొ వాహ్యాళికి పోయి కూడుచున బో;
కాళాతటిత్కామినీ
నటనా వైభవముల్ నిరాశయును
ఆంధ్యం బూడ్చె; చూచాయగా
ఎటో మార్గం బది కానుపించును
ప్రయాణింపఁగా వలెఁగా, రమ్మా! సం
కటముల్ బాసి ప్రపంచ మంతటను
సౌఖ్యశ్రీలు చెన్నారగఁ.

ఏనా డెవ్వడు కత్తితో గెలువలే
దీ విశ్వమున్; ప్రేమ పా
శాసన్ కట్టును నాలుగుం బది ప్రపంచాలన్;
మహాత్ముం డిదే
జ్ఞానోద్బోధము సేసె, నెవ్వడు వినెన్?
సాహిత్య సామ్రాజ్యమం
దైనన్ కొంతగ శాంతి పొడకొననిమ్మా!
నీకు పుణ్యంబగున్.